# కట్టమంచి 'ముసలమ్మ మరణం' - పరిశీలన

కె. దామోదర్ రెడ్డి

హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయానికి 1983 లో
యం. ఫిల్ డిగ్రీకై సమర్పించిన పరిశోధనా వ్యాసం

కట్టమంచి 'ముసలమ్మ మరణం'-పరిశీలన
యం. ఫిల్. పరిశోధనా వ్యాసం

కె. దామోదర్ రెడ్డి

రచనా కాలం : 1983

ప్రచురణ : అక్టోబర్ 1987

ప్రతులు . వేయి

హక్కులు : రచయితవి

ముఖచిత్రం : శీలావి

ప్రచురణ : ఫ్రెండ్స్ పబ్లికేషన్స్
1-8-7C2,/92/2
నల్లకుంట, హైద్రాబాద్-44.

ముద్రణ డాన్ ప్రెస్,
ఖైరతాబాద్, హైద్రాబాద్-4
ఫోన్ నెం. 220642

ప్రతులకు · నవయుగ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సుల్తాన్‌బజార్, హైద్రాబాద్,
ఫోన్ నెం. 44688

వెల : పది రూపాయలు

తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయంచే ముద్రితం

# తొలిమాట

ఆధునిక సాహిత్యానికి నవ్య మార్గ ప్రవర్తకునిగా పరిగణింప బడ్డారు కట్టమంచి కవిగా కంటె విమర్శకునిగానే సాహితీ లోకానికి చిరపరిచితుడు. ఆయన విమర్శను చేపట్టటానికి పూర్వం రచించిన కావ్యమే 'ముసలమ్మ మరణము' కవిత్వతత్త్వ విచార గ్రంథంలో ప్రతి పాదించిన కావ్యలక్షణాలు కవిగా ఆయన రచించిన తొలికావ్యంలో ఎలా రూపొందాయో పరిశీలించడానికి ప్రయత్నించాను.

కట్టమంచి రచనల్లో 'కవిత్వతత్త్వ విచారము' పై వచ్చినన్ని విమర్శలు ఆయన కావ్యరచనల పై రాలేదు అందుకు కారణం ఆ గ్రంథస్వభావమే. 'ముసలమ్మమరణము' కావ్యంపై రెండురకాల విమర్శలు వచ్చాయి. అందులో ఒకరకం విమర్శలు ఒకటి రెండు కారణాలు చెప్పి దీనిని నవ్య కావ్యమని, మరో రకం విమర్శలు కావ్యంలోని ఏవో కొన్ని భాగాల్ని ఉదహరించి ఇది 'ప్రబంధాలకేమీ తీసిపోదు' అనే భావాన్ని వెలిబుచ్చాయి ఈ రెండు రకాల విమర్శలను పరిశీలించి, సమన్వయం చేసి కావ్యాన్ని అన్ని కోణాల్లోంచి పరిశీలించి, కావ్యంలోని నవ్య గుణాన్ని చెప్పడానికి కృషిచేసాను.

పరిశోధనాంశాన్ని సమగ్రంగా రూపొందించడానికి ఐదు అధ్యాయాలుగా విభజించాను. మొదట అధ్యాయంలో కట్టమంచి వారి జీవితానికీ, సాహిత్యానికీ గల సంబంధాన్ని సమీక్షించాను.

రెండో అధ్యాయంలో కట్టమంచి కవిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని సమీక్షించే సమయంలో ప్రాచ్య, పాశ్చాత్యా ప్రభావాలను గూర్చి చెప్పడం అవసరం కనుక సంగ్రహంగా పరిశీలించాను.

మూడో అధ్యాయంలో- 'ముసలమ్మ మరణము' కావ్యావిర్భావానికి గల పూర్వాపరాల్ని చర్చించాను తత్పూర్వకావ్యాల కంటె నవ్యత గోచరించడానికి కారణభూతమైన కావ్యాంశాల్ని విపులంగా పరిశీలించాను.

నాలుగో అధ్యాయంలో- కట్టమంచిని ప్రేరణగా తీసుకొని తమ వ్యక్తిత్వాన్ని సాహిత్యరంగంలో సుస్థిరం చేసుకున్న రాళ్ళపల్లి, దువ్వూరిలపై కట్టమంచి ప్రభావాన్ని రేఖామాత్రంగానే స్పృశించాను.

ఐదో అధ్యాయంలో కట్టమంచి వారి సాహితీ వ్యక్తిత్వాన్ని గూర్చిన పలు విమర్శకుల అభిప్రాయాలను క్రోడీకరించి ఆధునిక సాహిత్యంలో ఆయన స్థానాన్ని నిర్ణయించే విధంగా వాటిని సమన్వయం చేసాను.

ఆధునిక సాహిత్య పురోగతికి కట్టమంచికి దగ్గర సంబంధం వుంది. కొత్తకొత్త ప్రక్రియలను ప్రవేశపెట్టిన కవులను ఆయన ప్రోత్సహించేవారు. ప్రశంసించేవారు. ఆయాకవుల సామర్థ్యాన్ని అవగతం చేసుకొని ఏయే ప్రక్రియలను వారు చేపట్టాలో తెలిపి వారిచే ఆ ప్రక్రియలను రూపొందింప చేసే వారు. ఈ విధంగా ఆధునిక సాహిత్య పురోగతిలో ప్రోత్సాహకునిగా ఆయన కున్న స్థానాన్ని చర్చించి అనుబంధంలో చేర్చాను.

సౌలభ్యానికై కట్టమంచి రామలింగారెడ్డి గారి పేరును 'కట్టమంచి' గాను, అక్కడక్కడ రెడ్డిగాను పేర్కొన్నాను. అవసరమనిపించిన చోట విషయావగాహనకై, ప్రాముఖ్యతను బట్టి అక్కడక్కడా పునరుక్తులు తప్పలేదు నాకు ప్రధానంగా ఉపకరించిన గ్రంథాలనే 'ఉపయుక్తగ్రంధసూచి'లో చేర్చాను. కట్టమంచి వారి రచనలను ప్రత్యేకంగా సూచించాను. పరిశోధనా విషయాన్ని సూచించి, ఎల్లవేళలా నా సందేహాలకు సమాధానమిస్తూ ప్రోత్సహించిన పూజ్యులు ఆచార్యులు శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారికి, పరిశోధన పూర్తి చేయడానికి అన్ని విషయాల్లో కాదనకుండా సహకరించిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారికి ప్రయత్నాన్ని గూర్చిన ప్రశ్నలు వేసి పరిశోధన పరిపూర్తికి స్ఫూర్తినందించిన డా॥ సి. ఆనందారామం గారికి సహాయ సహకారాలందించిన పెద్దలు శ్రీ పి. అమరేంద్రరెడ్డిగారికి, డా॥ కేతు విశ్వనాథ రెడ్డి గారికి పరిశోధన కవసరమయిన పుస్తకాలు పంపి ప్రోత్సహించిన శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ; డా॥ బి. భాస్కరచౌదరి, కట్టమంచి వారి మనుమడు శ్రీ సి. ఎ రెడ్డి, డా॥ జి. నాగయ్యగార్లకు, ప్రయత్నంలో, ఆవిష్కరణలో తోడ్పడిన మిత్రులు శ్రేయోభిలాషులు రాంబాబు, చంద్రశేఖర్, రవీంద్ర, శ్యామ్, దేవేందర్, మల్లేష్, వాసు, రమాంజనీకుమారి. కామేశ్వరి — లకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

కె. దామోదర్ రెడ్డి

# మెచ్చుకోతగిన సాహిత్య పరిశీలనా ప్రవృత్తి

విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగులో పరిశోధన మొదలయ్యాక ఒక మేలు జరిగింది అది పరిశోధనాంశం ఎన్నికకు సంబంధించింది విషయసేకరణకు సంబంధించింది కూడా. సాహిత్య ప్రపంచంలో వెలుగుకు రాని అనేక అంశాలను యువ పరిశోధకులు చేపట్టకతప్పని స్థితి ఏర్పడటంతో కొత్తకొత్త అంశాలను ఎన్నుకోవలసిన అగత్యం ఏర్పడింది పరిశోధనలో విషయసేకరణ ప్రాథమిక అవసరం కాబట్టి ఎన్నుకున్న అంశానికి అనుగుణంగా ఆ అంశంతో సంబంధం ఉన్న విషయాన్ని విస్తృతంగా సేకరించవలసిన అవసరం ఏర్పడింది గత ఆరు దశాబ్దాలుగా వెలువడిన పి హెచ్ డి స్థాయి పరిశోధక వ్యాసాలనూ, రెండు దశాబ్దాలుగా వెలువడిన ఎం ఫిల్. పరిశోధక వ్యాసాలనూ విద్యేకేతర రంగంలోని విమర్శ వ్యాసాలతో పోలిస్తే తెలుగు యువ పరిశోధకులు చేసిన కృషి రాశిలో తక్కువైంది కాదు తెలుగు సాహిత్య విమర్శకు ఈ పరిశోధక వ్యాసాలు సమాచారాన్ని సమకూర్చిన సన్నివేశాలూ, స్ఫూర్తిని ఇచ్చిన సందర్భాలు కూడా లేకపోలేదు అంతమాత్రంచేత తెలుగు పరిశోధన అంతా సవ్యంగా ఉందని కానీ, ఒక సాహిత్యాభిరుచికి అభిముఖంగా వెళ్ళిందని కానీ, ఒక ఖచ్చితమైన ప్రాపంచిక దృక్పథాన్ని ఇవ్వడానికి ప్రయత్నించిందని కానీ, ఒక సమగ్రమైన పరిశోధక వ్యాస నిర్మాణ లక్ష్యం రూపుదిద్దుకుందని కానీ అర్థంకాదు

యువ పరిశోధకులు కవులమీదా, రచయితలమీదా, ప్రక్రియలమీదా, ధోరణుల మీదా, ఉద్యమాలమీదా మన విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు చేశారు. చేస్తున్నారు. గత దశాబ్దంగా ఈ పరిశోధన ఆధునికకాలానికి సంబంధించిన సాహిత్యంమీద చెప్పుకో దగ్గ పరిమాణంలో సాగింది దీనికి కారణం మధ్యయుగ సాహిత్యంమీద అభిరుచి కొరవడటం కాదు, ఆధునిక యుగ సాహిత్యంలోని చైతన్యం ఈనాటి యువ పరిశోధకులకు సన్నిహితంగా ఉండటమే అంతేకాదు ఆధునిక కాలంలోని సాహిత్యాన్ని పరిశీలించటానికి అవసరమైన సామాజిక నేపథ్యంతోనూ, సాహిత్య సూత్రాలతోనూ, ఆధార సామగ్రితోనూ కొంత ఎక్కువ పరిచయం ఉండడం

చి॥ దామోదర్ రెడ్డి ఈ కారణాల వల్లనే కట్టమంచి 'ముసలమ్మ మరణం' కావ్యాన్ని ఆయన జీవిత సాహిత్య నేపథ్యాలు ఆధారంగా, ఆయన భావాలపై ప్రభా

వాలు ఆధా రంగా, ఆయన ప్రాపంచిక దృష్టి ఆధారంగా పరిశీలించటానికి పూను కొన్నాడని నా అభిప్రాయం.

ఎం ఫిల్. స్థాయిలోనైనా పరిశోధనకు తీసుకునే అంశంమీద విద్యార్థికి గౌరవం లేకుండా, ఏ అభిప్రాయాలూ లేకుండా పర్యవేక్షకుడి అనుశాసనం ప్రకారమో అభి రుచి ప్రకారమో తీసుకున్నా, పర్యవేక్షకుడి వ్యక్తిగత సాహిత్య బృందంలోని ఏదో ఒక సమకాలీనున్ని పరిశోధనాంశంగా ఎన్నుకున్నా ఆ పరిశోధనలో పరిశోధకుడి నిబద్ధతా వ్యక్తంకాదు, చిత్తశుద్ధీ ఉండదు. ఉండేదల్లా మాటలపోగులూ పొగడ్తలూ. ఈ పరిశోధక వ్యాసం పరిమాణంలో చాలా చిన్నది. ఐనా పైన చెప్పిన బలహీన తలు లేకుండా స్వీయాభిరుచినీ, చిత్తశుద్ధినీ ప్రతిబింబిస్తోంది. ఉల్లేఖనలు కూడా పరి శోధకుని వాదనలో భాగమయ్యాయి తప్ప తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం కాలేదు. ఇది నిజంగా యువ పరిశోధకుల్లో అరుదుగా కనిపించే లక్షణం.

కట్టమంచి రామలింగారెడ్డి ముసలమ్మమరణం కావ్యంలోని నవ్యతనూ, ప్రత్యేక తను సోదాహరణంగా నిరూపించటానికి ప్రయత్నించడమే కాకుండా ఆ కావ్యంలోని తాత్వికదృష్టిని అంచనావేయడానికి పరిశోధకుడు ప్రయత్నించాడు. ముసలమ్మ మర ణం కావ్యనిర్మాణంపైగల వివిధ ప్రభావాలనూ చర్చించాడు. "రచనావిధానం ప్రబంధా లకే దగ్గరగా ఉంది" అని నిష్కర్షగా నిరూపించాడు. పద్య నిర్మాణంపై తిక్కన ప్రభావాలను పసికట్టాడు. ఇతివృత్తంలో, పాత్రచిత్రణలో కట్టమంచి చూపిన పరిమిత వాస్తవికతను గుర్తించాడు ముఖ్యంగా కట్టమంచి కథాకావ్యంలోని వీరగాథా లక్ష ణాన్నీ, ఉద్దిష్ట సమాన ప్రయోజనాన్నీ గుర్తించి, దువ్వూరి 'నలజారమ్మ', చిలుకూరి 'ముసలమ్మ' కావ్యాలతో పోల్చి ముసలమ్మ మరణం వైశిష్ట్యాన్ని నిరూపించడానికి ప్రయత్నించాడు. "ఈ కావ్యంలో మరణాంతాన్ని విమర్శకుడు లోకకళ్యాణార్థమై జరిగింది కాబట్టి మంగళాంతమే అని పేర్కొని సంతృప్తి చెందారు. తొలి మరణాంత కావ్య రచన చేసిన ఘనత రెడ్డిదే" అని నిరూపించి సమన్వయ విమర్శకుల పొర బాటును చక్కదిద్దాడు. యువ పరిశోధకుల్లో కోరదగిన విద్యాస్థైర్యం ఇలాంటిదే.

పరిశోధకుడు కట్టమంచి ఆలోచనలూ ఆవేశాలలోని అస్థిరత్వాన్నీ వైరుధ్యా లనూ స్థూలంగా గుర్తించాడు. నిజానికి వాటివెలుగులో ముసలమ్మ మరణం కావ్యాన్ని గాఢంగా పరిశీలించి ఉంటే కవిత్వంలో ముసలమ్మ మరణం స్థానాన్ని ఖచ్చితంగా అంచనా వేయడానికి వీలయి ఉండేది.

కట్టమంచివారు 'ముసలమ్మ మరణం' వస్తువును కావ్యంగా మలచటానికి ఎందుకు తీసుకున్నాడు? ఆ వస్తువులోని జానపద సారళ్యం ఆయనను ఆకర్షించిందా?

ఒకప్పటి గ్రామీణ జీవితంలోని 'నలుగురి కోసం త్యాగం' అనే లక్షణం ఆకర్షించిందా? ముసలమ్మ తన కులానికి సంబంధించిన వీరవనిత కాబట్టే ఆమె వస్తువు ఆకర్షించిందా? (వేమన గోనబుద్ధారెడ్డి— వారిపై కట్టమంచి ఆకర్షణ లాగా!) ఖండ కావ్య వికాసాన్ని తెలిసిన పాఠకుడుగా, సాహిత్యవేత్తగా కట్టమంచి కథాకావ్య రచనకు పూనుకోవడంలో ఉన్న సాహిత్య మర్మం ఏమిటి? గురజాడ కథాకావ్యాలకూ కట్టమంచి కథాకావ్యానికీ మధ్యఉండే పోలికలు, భేదాలూ ఏమిటి? ఎందువల్ల వచ్చాయి? గ్రామీణ జీవితంలోని ఊకుడు కథలనూ పాటలనూ విన్న కట్టమంచి తన కథాకావ్యానికి గణబద్ధ ఛందోరూపాన్నే ఎందుకు వాడుకోవలసి వచ్చింది.? ఆయన భావాలలోని నవ్యతకూ, సాహిత్య పరిచయంలోని, అధునాతనత్వానికీ, విశ్లేషణలోని నైశిత్యానికీ ఛందస్సూ భాషా విషయంలోని సనాతనత్వానికీ సంబంధంగా దాన్ని గుర్తించవచ్చునా? (గురజాడ కన్యాశుల్కం మీద కట్టమంచి విమర్శనూ, ఇతరవాటినీ పోల్చిచూస్తే ఇది స్పష్టం).— ఇలాంటి ప్రశ్నలు వేసుకుంటూ కవిత్వతత్త్వ విచారములో కట్టమంచి "ప్రకటించిన విమర్శభావాలకు, తాత్త్వికదృష్టికి బీజాలను" ఆయన సాహిత్య సేవను సాధ్యమైనంత సమగ్రంగా పరిశీలించడానికి చి॥ దామోదరరెడ్డి ప్రయత్నిస్తాడని ఆశిస్తున్నాను. ప్రయత్నించాలని ఆకాంక్షిస్తున్నాను ఎం.ఫిల్. పరిధిలో పరిశోధకునికి ఇది సాధ్యమై ఉండక పోవచ్చు.

డిగ్రీలతోనే చదువు ఆగిపోకూడదు. ఏ ఉద్యోగంలో ఉన్నా సాహిత్య పరిశీలనా ప్రవృత్తిని చి॥ దామోదర్ నిలుపుకుంటూ ఒక మంచి సాహిత్య వివేచకుడుగా ఎదగాలని కోరుతున్నాను.

హైదరాబాదు
18-11-1987

కేతు విశ్వనాథరెడ్డి.
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం
హైదరాబాదు

# విషయ సూచిక

## 4 సమకాలీనులపై వెలుగు వీచికలు

# 1

# కట్టమంచి-జీవితం, సాహిత్యం

"ముల్లోకాలనేలే ముమ్మూర్తులు అద్దాలలో పాపలౌతున్నారు. 20వ శతాబ్ది మధ్యకాలం వరకు తెనుగు అక్షర ప్రపంచాన్ని ఏలుబడి చేసిన కిరీట ధారులందరూ పరంపరగా నింగి నీలాల తోపు నుండి తొడిమలూడిన పూవులై తెలుగు తల్లి ఒడిలో శిశువులై పడి కేవుదుమంటున్నారు"[1] 1880-1899 సం॥ ల మధ్య కాలంలో జన్మించిన వారిలో కట్ట మంచి రామలింగారెడ్డి, రాయప్రోలు, తల్లావఝ్ఝల, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, విశ్వనాథ, గుర్రం జాషువా, అడవి బాపిరాజు, దువ్వూరి, అబ్బూరి, దేవులపల్లి, నాయని గార్లు ప్రముఖులు. ఆధునికాంధ్ర కవితా సరస్వతికి ఒక స్వరూపాన్నిచ్చి సుస్థిరతను చేకూర్చిన అత్యంత ప్రతిభావంతులు వీరు. కవితలో కొత్తదనం విమర్శలో వినూత్న దృక్పథం, పలుకుబడిలో మాధుర్యం ఆధునికాంధ్ర సాహిత్య లక్షణం. ఈనాటి సాహిత్య స్వరూపం వారు పొందుపరచిన ప్రతిభ, ఆంధ్ర సహృదయ పాఠకలోకానికి విందు. ఎన్నుకొన్న ప్రక్రియలో అద్వితీయ వైవిధ్యాన్ని పోషించి ఎనలేని ఎత్తుకు ఎదిగిన వారు. ఒక్కొక్కరిది ఒక్కో మార్గం

ఆధునికాంధ్ర కవితా విపంచిని మీటి సరికొత్త రాగాలను పలికించిన వారు కట్టమంచి. "విద్యా సాహిత్య రంగాల్లో కట్టమంచి వారు కొండంతరెడ్డి. ఆ కొండ శిఖరం నుంచి ఎన్నో మెరుపులు మెరిశాయి, ఉరుములు ప్రతిధ్వనించాయి; ఝరులు ప్రవహించాయి. పరిసరస్థమైన ప్రజానీకం మొదట దిగ్భ్రమ పొందినా తర్వాత మేలుకొంది, ముందుకుసాగింది. సాహిత్యరంగంలో సరికొత్త భావాలకు, నూతన ఆలోచనా రీతులకు మనో వికాసాత్మకమైన విమర్శకు కట్టమంచి వారు చేసిన దోహదం అసదృశం"[2] అరుదుగా లభించే బిరుదుల్ని గౌరవప్రదంగా పొందిన ప్రతిభాశాలి కట్టమంచి రామలింగారెడ్డి.

రామలింగారెడ్డి 10, డిసెంబరు 1880 సం॥ కట్టమంచి గ్రామంలో సుబ్రహ్మణ్యరెడ్డి, నారాయణమ్మ దంపతులకు జన్మించారు. ఆంధ్రభాషాభిమానం, అందులో ప్రావీణ్యం రెడ్డికి వంశపారంపర్యంగా వచ్చిన సుగుణాలు ఆ రోజుల్లో మహాకవిగా పేరు పొందిన భాస్కరశతక కర్త పెద రామలింగారెడ్డి ఈయన ముత్తాత. పెద రామలింగారెడ్డి జ్యోతిష్యం, మంత్రశాస్త్రం, షట్ప్రయోగాలు నేర్చినవాడు. రామలింగారెడ్డి వ్యక్తిత్వంపై అత్యధిక ప్రభావాన్ని వేసిన గురువు కుప్పనయ్యం గారు. ఆయన గురువు పెద రామలింగారెడ్డి.

కట్టమంచి అయిదో ఎట వీధిబడిలో చేరారు. ఆ బళ్ళో పంతులు, ఆయన మొట్ట మొదటి గురువూ–'మును స్వామి మందిరి'. ఈయన వద్దనే కట్టమంచి బాల రామాయణం, అమరం చక్కగా చదువు కొన్నారు. కొద్ది కాలానికి ప్రథమ గురువు కాల ధర్మం చెందగా కట్టమంచి చదువు తండ్రి వద్ద కొనసాగింది. భారత భాగవతాలతో పాటు కొంచెం యింగ్లీషు కూడా నేర్చుకున్నారు. తండ్రి సుబ్రహ్మణ్యరెడ్డికి కవిత్వ మంటే భయం. విష గణాలు పడి యెవరికే చేటు వాటిల్లుతుందో అని ఆయన వెరపు. రామలింగా రెడ్డికి అదెక్కడ అబ్బుతుందో అని బాధపడేవారు. కాని భారతం తనవలెనే చదివే నేర్పు అలవడే సరికి పరమానంద భరితుడయినాడు. తండ్రి సమక్షంలో తనకు కలిగిన వికాసాన్ని రామలింగారెడ్డి ''నాకుఁ దెనుగున నుండు విద్య వారిడిన భిక్షయే కాని వేఱు కాదు. భారత భాగవతములను మనసున నాటి, కాలక్రమమున వికసనమునకు వచ్చునట్లు చేసిరి''.[3] అని పేర్కొన్నారు.

కట్టమంచి బాల్యంలో ఆట పాటలతో పాటు ఆసక్తితో దగ్గరి బంధువు, వరద రాజశతక కర్తయైన 'అమ్మాయమ్మ' గ్రామమైన గుండ్లపల్లెకు వెళ్ళి, ఆమె వద్ద నూరు కథలు నేర్చుకున్నాడు. పదేళ్ళప్రాయంలో నూరు కథలని స్మృతి పథంలో దాచుకొని 'నూరు కథల రెడ్డి'గా అందరి మన్ననలకు గురైనాడు. ఆమె వద్ద ఊకుడు కథలు వినడమే కాదు, ఆమె కోరినంతనే రాగయుక్తంగా భారతాన్ని చదివి తోచిన వ్యాఖ్యానాన్ని చెప్పి తన పాండిత్యాన్ని నిలుపుకున్నాడు. "పూర్వము నాకామె ఊకుడు కథలు చెప్పి జ్ఞాపక శక్తిని, భావనా శక్తిని వృద్ధి పఱచెను''[4] అని ఆమెకు కట్టమంచి కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

1890 సం॥లో రెడ్డి చిత్తూరు బోర్డు హైస్కూలు మొదటి ఫారంలో ప్రవేశించారు. స్కూలు భవనంలో ఉన్న నీతి వాక్యం "Look up-aim high" విద్యార్థులకు, ఉపాధ్యాయులకు ఎంతో ఉత్తేజాన్నిచ్చింది. అది కట్టమంచి జీవితంలో ప్రతిబింబించింది. పాఠశాల జీవితంలో వీరి గురువులు కుప్పనయ్యం గారు, వేంకట కృష్ణమాచార్యులు. వీరిద్దరూ రెడ్డిపై నెరపిన ప్రభావం ఎనలేనిది. ఆ విషయాన్నే కట్టమంచి:

> "కుప్పనయ్యం గార్లును, వారి యనంతరము పండితులుగా వచ్చిన వేంకట కృష్ణమాచార్యులును నేర్పిన దాని కంటె నెక్కువ నేను కాలేజికి వెళ్ళిన తర్వాత నేర్చుకోలేదు. అ వచ్చిన దానితోనే భాషా యాత్ర గడుపు చున్నాను"[5]

అని చెపుకున్నారు.

ఆరవ ఫారంలో అంటే పదహారవ ఏట అనీబిసెంటు దివ్యజ్ఞాన సమాజం వైపు కట్టమంచి ఆకర్షితుడయ్యారు. మానసిక అసంతృప్తులు, అశాంతులు తుపాను రేపసాగాయి. అనీబిసెంటు రచించిన ఆత్మకథ ప్రగాఢ ప్రభావాన్ని వేసింది. అన్నింటి కంటే మించి ఆమె వ్యక్తిత్వం ఆయన సున్నిత హృదయం మీద చెరగని ముద్ర వేసింది. ఆమె సాహిత్యం మీద, ఆమె జీవితం మీద ఆయనకు అపారమైన ఆకర్షణ కట్టమంచి మాటల్లో—

"...But the personality of Mrs. Annie Besant was to me far more than the philosophies a ray of light from a transcendant beyond"[6] ఈ ప్రభావం నుండి తాత్కాలికంగా బయట పడి, చదువుకు కలిగిన అంతరాయాన్ని నెల రోజుల కాలంలో నిగ్రహం సడలకుండా చదివి ఉన్నత పాఠశాల పరీక్షలో ఉత్తీర్ణత పొందారు. ఈ కాలంలోనే ముత్తాత గొప్పతనాన్ని తన గురువు పదే పదే ప్రస్తావించడం వల్ల తాను కూడా అంతటి వాణ్ణి కావాలనే కోరిక దృఢంగా నాటు కోవడం సహజంగా జరిగిందే.

పాఠశాల విద్య పూర్తికాగానే 1897 సం॥లో మద్రాసు క్రైస్తవ కళాశాలలో ప్రవేశించారు. ఆ కళాశాల ప్రిన్సిపాలు డా॥ మిల్లర్. "డా॥ మిల్లర్ మాకు ప్రప్రథమముగా స్వపరిపాలన విద్య గరపినాడు. మా సంస్థలను, సంఘాలను మా అంతట మేమే పరిపాలించుకొనేట్లు చేసినాడు. మమ్ము

లను ఆయన విద్యావంతులను గానే కాదు, మనుష్యులనుగా తయారుచేసినాడు క్రైస్తవ కళాశాలలో ఆయన పెంచిన సంప్రదాయము చాలా గొప్పది.''7 అని రెడ్డి తన కళాశాల స్మృతులలో డా॥ మిల్లర్‌ను ప్రశంసించారు. అదే కళాశాలలో రెడ్డికి తత్త్వశాస్త్రాన్ని బోధించిన వారు డా॥ స్కిన్నర్. ఆయన ఎంతటి శిక్షకుడో, అంతటి ప్రేమాభిమానాల్ని ప్రదర్శించ గల మహానుభావుడు కట్టమంచి తత్త్వశాస్త్ర అధ్యయనానికి ప్రోత్సాహం ఆయనదే. పట్ట పరీక్షలో ఉత్తీర్ణత అనంతరం విద్యార్థి వేతనంతో ఇంగ్లండ్ పంపే వరకు ప్రయత్నించిన వారు డా॥ స్కిన్నర్. 'చరిత్ర'ను బోధించిన గురువు 'కెల్లెత్'. ప్రతి విషయంలోనూ ప్రతిభావంతుడైన కట్టమంచి గణితంలో మాత్రం గణించదగిన వారు కాదు. గణితశాస్త్రాధ్యాపకుడు ప్రొ॥ వెంకట సుబ్బయ్య ప్రత్యేక శ్రద్ధతో బోధించి ప్రథమ శ్రేణిలో ఫలితాన్ని సాధింప చేసారు. లేకున్న గణితం 'గుంటపెట్టి గంట వాయించెడిదే' అని చెప్పు కున్నారు రెడ్డి.

## ముసలమ్మ మరణం-ఆధునికాంధ్ర సాహిత్య ఉషః కిరణం.

1899 వ సం॥లో కట్టమంచి చదువుతున్న క్రైస్తవ కళాశాలలో "ఆంధ్ర భాషాభిరంజనీ'' సమాజ పోషకులైన సమర్థి రంగయ్యసెట్టి గారు నవ్యకావ్య రచయితలను ప్రోత్సహించటానికై నిర్వహించిన పోటీలో బహుమతి గెల్చుకోడానికై రెడ్డి రాసిన లఘుకావ్యం 'ముసలమ్మమరణం' బహుమతి నిర్ణేతలలో ఒకరు విమర్శకాగ్రేసరులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి విద్యార్థి దశలోనే కట్టమంచి ప్రతిభా పాటవాల్ని గ్రహించిన శాస్త్రి గారు ఎంతగానో ప్రోత్సాహమిచ్చి, కళాపూర్ణోదయ విమర్శన వ్యాసాన్ని అధ్యక్షపీఠం నుండి సాంగోపాంగంగా విని అక్కడక్కడ సవరించి అత్యుక్తి దోషమును సవరించుకొన్న నీవు మంచి విమర్శకుడ వగుదువ'ని ప్రోత్సహించారు.

తరువాతి కాలంలో 'ముసలమ్మ మరణము' కావ్యంపై అనేక చర్చలు జరిగాయి. అది ఆధునికాంధ్ర కావ్య మగునా? కాదా? అనేదే ఆ చర్చల సారాంశం. ఈ కావ్యాంశాలను తర్వాతి అధ్యాయంలో ప్రత్యేకంగా చర్చిం

చడం జరుగుతుంది. అందుకు ముందుగా ఆ కావ్యావిర్భావం జరిగిన నాటి ఆంధ్ర సాహిత్యస్వరూపం ఏమిటో స్థూలంగా పరిశీలించడం ఆవశ్యకం.

19 వ శతాబ్దం నాటికి ఆంధ్ర దేశం అంతా ఇంగ్లీషు వాళ్ళ పరిపాలనలోకి వచ్చింది, అయితే వారి ప్రభావం వెంటనే ఏ విధంగానూ సోకలేదు. కొత్తపల్లి వీరభద్రరావు గారు పేర్కొన్నట్లు "వారి సాహిత్య సంస్కృతుల ప్రభావము మనపై సోకుట ఆంగ్ల విద్యా విధానము అమలులోనికి వచ్చు వరకును గాఢముగా లేదన వచ్చును"[8] "మేధావులైన భారతీయ రచయితలందరు పాశ్చాత్య సాహిత్య సంస్కృతులకు, వైవిధ్యమునకు ముగ్ధులై తమ భావనా ప్రపంచమును, రచనాక్రమమును తీర్చిదిద్దుకొనుచు వచ్చిన కాలము యిదియే ఈ విధముగా ఈకాలమొక సంధి యుగము"[9] అని 19వ శతాబ్దం నాటి పరిస్థితిని తెలియ చేసారు. పాశ్చాత్య ప్రభావంతో ప్రజా జీవనంతో పాటు సాహిత్యంలోనూ చాలా మార్పులు సంభవించాయి. ప్రభావ పరిధి విస్తరించి అది ఫలితంగా మూరేటప్పటికి రెండు తెగల సాహితీ వేత్తలందు ఉద్భవించారు. భావ సంపదను, వస్తువిన్యాస్యాన్నిగైకొని సంప్రదాయ మార్గంలో నడచిన వారు కొందరు, నవీనమార్గంలో నవ్య దృక్పథంతో నాణ్యతను చూపిన వారు మరికొందరు భిన్న వర్గాలున్నా అది ఏదో ఒక విధంగా సాహిత్యానికి దోహదమే అయింది. అందుకే రామలింగారెడ్డిని పింగళి లక్ష్మీకాంతం గారు "ప్రాచీనతా పక్షపాతము కల నవ్యమార్గ ప్రవర్తకులలో మన రామలింగారెడ్డిగారు ముఖ్యులు"[10] అని పేర్కొనడం సముచితం గానే ఉంది. కావ్యకర్త రెడ్డి, నాటికి యువకుడే అయినా ప్రౌఢమైన రచనను ప్రకటించి పలువురి మన్ననలను పొందారు. జి యన్. రెడ్డి గారన్నట్లు "ముసలమ్మ మరణం ప్రబంధ కవితకు మరణం."[11]

## ప్రవాసదేశంలో పరిపూర్ణత

పట్టభద్రుడైన కట్టమంచిని ఆనాటి భారత ప్రభుత్వం విదేశానికి పంపి ప్రజ్ఞా పాటవాలకు పట్టాభిషేకం చేసింది. విదేశంలో చేరడమే కాదు, విజ్ఞానాన్ని ప్రదర్శించి అక్కడ 1903 లో 'రైట్ బహుమతి పొందారు. 1904 లో సెయింట్ జోన్స్ కళాశాలలో విద్వాంసునిగా పరిగణింపబడ్డారు. అదేకాలంలో కేంబ్రిడ్జి యూనివర్సిటీ లిబరల్‌క్లబ్ కార్యదర్శిగా

కూడా ఎన్నికైనారు. 1905వ సం॥లో ఆంగ్ల దేశంలో జరిగిన ఎన్నికల్లో లిబరల్ పార్టీకి అనుకూలంగా కేంబ్రిడ్జి యూనియన్ సెక్రెటరీగా సభలు ఏర్పాటు చేసారు ఆ సభల్లో ఆయన ప్రసంగించిన తీరూ, అనర్గళమైన ఇంగ్లీషు భాషా ప్రవాహం, వక్తృత్వ నైపుణి ఆంగ్లేయుల్ని ఆశ్చర్యంలో ముంచెత్తాయి. కాంగ్రెసు సందేశాన్ని ఆంగ్ల దేశంలో అందించడానికి వచ్చిన సుప్రసిద్ధ భారతీయ నాయకులు గోఖలే, లజ్‌పతిరాయ్ లతో తానూ ప్రసంగించారు. వారిలో గోఖలే వ్యక్తిత్వం కట్టమంచిని ఆకర్షించింది. వారిరువురివీ విరుద్ధ స్వభావాలు రామలింగారెడ్డి జీవితం ఆలోచనలకూ, ఆవేశాలకూ కొంత అస్థిర స్వభావానికి నిలయం. గోఖలే జీవితం యిందుకు విరుద్ధం. ఆయనలో ఆలోచన ఎక్కువ; ఆవేశం తక్కువ. స్థిరత్వం ఎక్కువ అనుకూల స్వభావాలు గల వ్యక్తుల మధ్య కంటె ప్రతికూల స్వభావాల వ్యక్తుల మధ్య ఆకర్షణ అధికంగా ఉంటుంది. కనుకనే కట్టమంచికి గోఖలే అంటే అంత అధిక ఆకర్షణ.''[12]

ఆ తర్వాత కేంబ్రిడ్జి యూనియన్ సొసైటీకి ఉపాధ్యక్షునిగా ఎన్నికయ్యారు. బారిస్టర్ పరీక్షకు చదవాలన్న కోరిక గాఢంగాఉన్నా గోఖలే గారి ప్రోత్సాహం ఎం. ఏ. చారిత్రక [Historical Tripos] విషయాన్ని చదివి ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యేలా చేసింది. పాల్గొన్న ప్రతివిషయంలో అద్వితీయ ప్రతిభా పాటవాల్ని కనబరుస్తున్న కట్టమంచిని, విదేశీ సీమల్లో విస్తరిస్తున్న అతని అఖండ ఖ్యాతి బరోడాధీశుని ఆకర్షించి, ఆయనను స్వదేశం చేర్చి, మాతృభూమికై సేవ చేయించింది.

1906 వ సం॥ నాటికి విదేశాల్లో విద్యాభ్యాసం ముగిసింది. బరోడా రాజు కోరికపై అమెరికాలోని విద్యావిధానాన్ని అధ్యయనం చేసి బరోడా కళాశాలలో అరవిందుని స్థానంలో ఉపాధ్యక్ష పదవిలో నియమింపబడ్డారు. 1909 వ సం॥లో ఆ పదవికి స్వస్తి చెప్పి మైసూరు చేరారు. మైసూరు ప్రభుత్వం వారేర్పాటు చేసిన ఉపన్యాసాలలో పాల్గొని విద్యావిధానంలోని సంస్కరణలను గురించి తెల్పారు. అచటి దివాను గారైన మాధవరావు ఆయన ప్రతిభను గ్రహించి మైసూరు విద్యారంగం యిలాంటి విద్యాశిల్పి చేతిలోనే చక్కని రూపు దాలుస్తుందని భావించి మహారాజా కళాశాలలో రెడ్డిని

ఆచార్యునిగా నియమించారు. అడుగిడిన ప్రతిచోట ఆకర్షణగొలిపే వ్యక్తిత్వం కట్టమంచిది.

విద్యాచార్యునిగా ఆయన ఆకర్షించని విద్యార్థి లేడు. ఆయన బోధించిన విషయాలు ఆంగ్లం, చరిత్ర, తత్వశాస్త్రం. ఆంధ్రుడైనా, మాతృభాషీయులైన ఆంగ్లాచార్యులకంటె ఆంగ్ల సారస్వతంలోని సొబగుల్ని విద్యార్థులకు ప్రతిభావంతంగా తేటతెల్లం చేసేవారు ప్రతిభా వంతులైన విద్యార్థులను వెన్నుతట్టి, కలం పట్టి రచనలు చేసేలా ప్రోత్సహించేవారు.

## ఆధునిక విమర్శకు వేకువ వెలుగు 'కవిత్వ తత్వ విచారం'

1899వ సం॥ లోనే కళాపూర్ణోదయంపై చేసిన విమర్శ బీజరూపంలో ఉండి 1914 వ సం॥ నాటికి మహా వృక్షమై శాఖలతో విస్తరించి 'కవిత్వ తత్వ విచారము' రూపంలో కుసుమించింది. మన ప్రాచీన సాహిత్యం సంస్కృతఛాయల్లో నడిచింది. సంస్కృత సాహిత్యం అనువాదంగానో, అనుసృజన రూపంగానో ఆంధ్రభాషలో ఆవిర్భవించింది, అనువాద, అనుసృజనలు ముగిసినా సంస్కృత సాహిత్య స్వరూప స్వభావాల ప్రభావాల నీడల్లోనే ఆంధ్ర సాహిత్యం నిలిచింది. తత్ఫలితంగా అనేక సాహితీరీతులు వెర్రితలలు వేయడం ప్రారంభించాయి. నన్నయ భారతం నుండి ప్రబంధ యుగం వరకు నవ్యంగా సాగి, అచటి నుండి క్షీణ ప్రబంధ యుగంగా పరిణమించింది. దీనికి తోడు కావ్య విమర్శకూడా అందుకు తగినట్లే కొనసాగింది. "కావ్య సుందరి శరీరమును శతధా ఖండించి శవ పరీక్ష చేసినట్లే విమర్శలు సాగినవి కాని కావ్యాత్మను గమనించే ప్రయత్నం జరుగలేదు."[13]

ఆంధ్ర సాహిత్యవిమర్శ గాడి తప్పిన కాలంలో ఆంగ్ల సాహిత్యసంప్రదాయానుగుణంగా సాహిత్య విమర్శ ప్రారంభించి కావ్యాత్మకు గౌరవంకూర్చిన గౌరవం ఆయనకే దక్కింది."వర్డ్స్ వర్త్ దృక్పథం, హాజ్ లిట్ శైలి, అభిరుచి విమర్శపద్ధతి, కాల్ రిడ్జ్ లాంటి ప్రపంచన విధానం కట్టమంచిలో త్రివేణిలా సంగమించి ఒక ఉద్యమాన్నే తెలుగు విమర్శకు ప్రసాదించాయి."[14]

"సాహిత్య విమర్శకుడుగా కట్టమంచి సాగించిన ఉద్యమం వలన తెలుగు సాహిత్య విమర్శపై పాశ్చాత్య కాల్పానిక విమర్శ ప్రభావం ఉప్పెనగా పొంగి ముంచెత్తి వేసినట్లయింది. ఆయన అగస్త్యుని వంటి వాడు కాబట్టి పాశ్చాత్యయుగ చైతన్య పయోధినంతా ఆపోశన పట్టి తెలుగులో దేశీయంగా వెలువరించ గలిగాడు"[15]

అన్న ఖ్యాతిని కట్టమంచి వశం చేసుకున్నారు.

విమర్శకుని చిత్త వృత్తిని అనుసరించి విమర్శ ఉంటుంది. అయినప్పటికీ గుణాన్ని గుణంగానూ, దోషాన్ని దోషంగానూ వర్ణించడం ఉత్తమ విమర్శకుని లక్షణం. కట్టమంచి వారు అభిరుచి విమర్శను వెలయించినా, ప్రతి వాక్యం హేతుబద్ధం కాక పోయినా, మధురమైన శైలిలో ఒక్కో వాక్యం ద్వారా సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నట్లే వ్రాయడం ఆయన ప్రతిభకు నిదర్శనం

విజ్ఞాన చంద్రికా మండలి వారి కోరికపై అర్థ శాస్త్ర రచనకు ఉద్యుక్తులైనారు. దేశాభివృద్ధిలో అర్ధ శాస్త్రానికి అత్యధిక ప్రాముఖ్యం ఉంది. ఆయా దేశాల సాంఘికాచారాలు, రాజకీయ స్థితిగతుల్ని బట్టి ఆర్థిక నియామాలేర్పడతాయి. అందుకే మన దేశంలో సామాన్య ప్రజలకు యీ విషయాలన్నీ తెలియాలనే మహత్సం కల్పంతో ఈ గ్రంధ రచనను చేపట్టి తీర్చిదిద్దారు. జాన్ స్టూవర్టు మిల్లు ప్రేరణతోనే అర్థశాస్త్ర రచన చేసారు. అర్థశాస్త్రం సాంఘిక శాస్త్ర సంబంధిగా ఉండాలన్నది స్టూవర్ట్ మిల్లర్ అభిప్రాయం. దీని నాదర్శంగా తీసుకొని స్వతంత్ర బుద్ధితో మన దేశ, కాల పరిస్థితులను సంపూర్ణంగా అవగాహన చేసికొని అర్థశాస్త్ర రచన చేసారు. సాంఘిక దృష్టి లోపించడం వల్లనే మనం పతనం చెందామని, సాంఘికార్థిక దృష్టి కలిగి నేటి కాలాను గుణంగా పరిశ్రమల్ని పెంపొందించుకోవాలని, భుక్తి కుదిరిన గాని ముక్తి కుదరదని గ్రహించడం అవసరమని శాస్త్రీయావగాహనతో అధికారికంగా నొక్కి చెప్పిన ఆర్థిక శాస్త్రవేత్త రెడ్డి.

## "ఆంధ్రా ఆర్నాల్డ్" కట్టమంచి

కట్టమంచి 1916వ సం॥లో మైసూరు యువరాజుతో కలిసి ఐరోపాలో పర్యటించారు. వివిధ విద్యా సంస్థల తీరు తెన్నులను ఆకళింపు చేసికొని

స్వదేశం చేరిన తర్వాత ప్రభుత్వానికి నివేదిక సమర్పించారు. 1916వ సం॥లో ఆయన తయారు చేసిన ప్రణాళిక ననుసరించే మైసూరు విశ్వ విద్యాలయం రూపురేఖలు దిద్దుకొంది.

1915వ సం॥లో రెడ్డి మహారాజా కళాశాలకు అధ్యక్షుడైనాడు. కళాశాలలోని వివిధ శాఖలను అధునాతనం చేయడానికి, కొన్ని కొత్త శాఖలను ప్రారంభించ సమ కట్టారు. ఆ సమయంలోనే తెలుగు శాఖలో రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారిని నియమించారు. రాళ్ళపల్లి వారు వేమన పై గ్రంధం రాయడానికి కారణ భూతుడు రెడ్డి. వేమన అంటే కట్టమంచికి ప్రత్యేకమైన అభిమానం. "వేమన ద్వారా తెలుగు వారిని వెలుగు బాటలో ప్రవేశపెట్టాలని, వారిలో ఆశలు రేకెత్తించాలని మూల విషయాలను సైతమూ నిశితంగా పరిశీలించేట్లు చేయాలని, వీటికి తోడు తేట తెలుగు దేశికవిత మీద మోజు పెంచాలని"[16] కట్టమంచి భావించి ఉంటారు. వేమనపై ఆంగ్లంలో రాసిన వ్యాసాన్ని గూర్చి సంజీవదేవ్: 'వేమన తన కవిత్వానికి ప్రేరణనంతా ప్రజల నుండీ, ప్రకృతి నుండీ పొందేడని చెపుతూ గ్రంధ కర్త చిత్రంగా అంటారు.

'He is both a poet of nature and a natural poet"[17]

కట్టమంచి ప్రతిభను మరో మెట్టు ఎక్కించింది మైసూరు ప్రభుత్వం. విద్యాశాఖాధికారిగా నియమితులయారు రెడ్డి. ఆ క్షణం నుండి అక్కడి విద్యా విధానం కొత్త పుంతలు తొక్కింది. విద్య మారుమూల గ్రామాల్లోకి విస్తరించింది. అంతకాలం అంటరాని వారిగా అల్లంత దూరంలో ఉన్న హరిజనులకు బడిలో చేరే యోగ్యత కల్పించారు అభ్యుదయ భావాల రామలింగయ్య. తాను యింత చేసినా సంతృప్తి పొందలేదు. ఆయన్ని జీవితం మరో వేపు ఆహ్వానిస్తోంది. అప్పటికి విద్యా రంగం నుండి తాత్కాలికంగా వైదొలగి 1921వ సం॥లో రాజకీయ రంగంలో ప్రవేశించారు.

## రాజకీయ రంగం

1921 సం॥ నుండి 1925 సం॥ వరకు కట్టమంచి రాజకీయాల్లో ఉన్నారు. మిత్రుల ప్రోద్బలంతో జస్టిస్ పార్టీలో చేరక తప్పింది కాదు. ఫలితంగా లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికయ్యారు. కట్టమంచి అధికార పక్షంలో ఉంటే ప్రతిపక్షాన్ని, ప్రతిపక్షంలో ఉంటే అధికార వర్గాన్ని హడల్ పుట్టించే

వారు. "శాసన సభలో రాణించడానికి కావలసిన శక్తి సామర్థ్యాలన్నీ కలిగి ఉన్నవారు. మదరాసు శాసన సభలో రెడ్డి తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రదర్శించారు. ఏ విషయాన్నైనా ఆధునిక దృక్పథంతో పరిశీలించి, మనోహరంగా వ్యక్తం చేసే నేర్పు అతని శాసన సభా ప్రసంగాల్లోనో, చర్చల్లోనో వెల్లడయేది. సమయస్ఫూర్తితో కూడిన హాస్యకుశలత, దెబ్బకు దెబ్బతీయ గల నేర్పు, వాదచాతుర్యం, వక్తృత్వ నైపుణ్యం అతన్ని గొప్ప రాజకీయ కుశలుణ్ణి చేశాయి"[18]

ప్రతిపక్షంలో ఉన్నా ఆంధ్ర విశ్వ విద్యాలయం ఏర్పడినపుడు దానికి ఉపాధ్యక్షునిగా తగిన అర్హతలు గలిగిన వాడు రెడ్డి గారొక్కరేనని పానగల్లు రాజా భావించి, కట్టమంచి వారిని ఆంధ్ర విశ్వ విద్యాలయ ప్రథమ ఉపాధ్యక్షుడుగా నియమించారు.

> "ఈ నియామకాన్ని అందరూ హర్షించారు. 'A lass to politics and a gain to education' అని ప్రముఖులు, పత్రికలు ప్రశంసించారు"[19]

ప్రతిభా సంపన్నులు నిష్క్రమించిన చోట ప్రజా పరిమళాలెలా దాగుంటాయి? ఉపాధ్యక్ష హోదాలో మహోన్నత కృషి సల్పి విశ్వ విద్యాలయాన్ని ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దారు. 1930 సం॥లో గాంధీజీ సత్యాగ్రహాన్ని అణచడానికి ప్రభుత్వం అవలంబించిన దమనకాండకు నిరసనగా తన పదవికి రాజీనామా చేసి స్వాతంత్రోద్యమంలో తన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చారు. ఆ రోజుల్లోనే గాంధీజీ ఉద్యమం గురించి కొన్ని వ్యాసాలను రచించారు. ఆనాటి గాంధేయవాదు లెవరూ గాంధీ సిద్ధాంతాలను అనుసరించ లేదు. గాంధీజీకి నిజమైన అనుచరుడు గాంధీయే అని ధైర్యంగా చెప్ప గలిగారు.

నవయామిని అనే ఖండ కావ్యం కూడా ఈ మధ్య కాలంలోనే రచించారు. సంస్కృతంలోని బిల్హణీయం అసభ్యశృంగారానికి అలవాలమై ఉంది. దీని ఆధారంగా చిత్రకవి సింగనార్యుడు 'ఆంధ్ర బిల్హణీయము'ను తెలుగులో రచించారు. కట్టమంచి దృష్టిలో బిల్హణీయ కావ్యం అనాదరణీయం. ఆ కథలో ప్రాయోభావం శూన్యం. ఆ కథలోని సంఘటనల్ని ఖండిస్తూనే, తానొక నూతన కల్పన చేసి కథలోని నాయికా నాయకులను ఆదర్శప్రాయంగా రూపొందించారు. ఇది ప్రబంధాల్లోని అశ్లీల శృంగారంపై తిరస్కార భావమే

కాకుండా ఈనాడు భావ కవిత్వంలో పేర్కొనబడుతున్న 'అంతరంగ వర్ణన' ప్రధానమన్న విషయాన్ని కట్టమంచి ఆరోజుల్లోనే 'నవయామిని' ఖండ కావ్యంలో వర్ణించి స్త్రీ పాత్రను ఆదర్శమూర్తిగా తీర్చిదిద్దారు.

1936వ సం॥లో రెండోసారి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవిని చేపట్టారు. ఈ మారు విశ్వవిద్యాలయంపై ప్రత్యేక శ్రద్ధకుదిరింది. ఆంధ్ర వాఙ్మయానికి ఒక స్వరూపాన్నిచ్చారు. తంజావూరు సరస్వతీ మహల్ లో అముద్రితాలుగా ఉన్న ఆంధ్ర గ్రంధాలకు ప్రతుల్ని తయారు చేయించారు. ఆంధ్ర విద్వాంసు లెందరికో 'కళాప్రపూర్ణ' బిరుదాలిచ్చి సత్కరించారు. ఆయన కాలంలోనే ఆంధ్ర విశ్వకళా పరిషత్తు గణనీయమైన అభివృద్ధిని సాధించింది.

1940వ సం॥ డిసెంబర్ నెల 10వ తేదీ రెడ్డి గారి షష్టిపూర్తి ఉత్సవాలు ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఆవరణలో జరిగాయి. ఉపాధ్యక్షునిగా ఆయనకు, విద్యార్థులకు మధ్య ఏర్పడ్డ అపోహవల్ల ఆ ఉత్సవాన్ని విద్యార్థులు బహిష్కరించారు. తన జీవితాంతం ఎవరి కోసమైతే కృషి చేసాడో వాళ్ళే ఉత్సవాన్ని బహిష్కరించడం ఆయనకు బాధ కలిగించింది. ఉత్సవం జరిగిందనే సంతోషం కంటే, విద్యార్థులు బహిష్కరించారనే బాధ ఆయన్ను వేదనా సముద్రంలో క్రుంగ దీసింది.

## ఏకలవ్య శిష్యులు—ద్రోణాచార్యుడు

కట్టమంచి వారితో పరిచయమైన వ్యక్తి ఎవరూ అతని ప్రభావపు ఛాయలు పడకుండా ముందుకు వెళ్ళి పోలేదు. ఈ విషయాన్నే వారి విద్యార్థి ఎ. ఎస్. రామన్:

> "I had been a good Ekalavya to this Dronacharya with a difference He never demanded 'guru dakshina' from me, because he had only Ekalavyas, even among the dissidents, and no Arjunas"[20]

అని పేర్కొన్నారు. డా॥ కొత్తపల్లి వీరభద్రరావు "రెడ్డిగారి బహుముఖ ప్రజ్ఞా నిధిత్వమే నన్ను ప్రభావితుణ్ణి చేసింది. ఆయన్ని ఆదర్శంగా తీసుకొనే నేను ముందుకు నడిచాను'[21] అనడం కట్టమంచి గారు ప్రతిభా

సంపన్నులపై తన ప్రభావాన్ని నెరపి ఎలా ముందుకు నడిపించారో తెలుస్తుంది.

1949 వ సం॥ లో ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవికి రాజీనామాచేసి మైసూరు విశ్వవిద్యాలయపు ప్రోఛాన్సలర్ పదవి స్వీకరించడంతో రెడ్డి జీవితంలో 'అస్థిరత'మరోసారి రుజువైంది ఆకాలంలోనే అనారోగ్యం ఆయన్ని కృంగ దీసింది. నింగినుండి నేలకు రాలిన నక్షత్రం మళ్ళీ అనంతాకాశంలో కలసి పోయింది. 24, ఫిబ్రవరి 1951 వ సం॥ లో ఆఖరి శ్వాస పీల్చారు రెడ్డి.

# 2

# కట్టమంచి భావాలపై ప్రభావాలు

1897 వ సం॥లో కట్టమంచి రామలింగారెడ్డి మద్రాసులోని క్రిస్టియన్ కళాశాలలో చేరారు. అప్పటికే ఆంగ్లేయులతోపాటు వారి విద్యావిధానం కూడా దేశాన్ని ఆక్రమించింది ఆ కళాశాలలో ఆయనకు గురువులు డా॥ మిల్లర్, డా॥ స్కిన్నర్ మొదలైన పాశ్చాత్యులు. ఈ మహోన్నతుల శిష్యరికంలో రెడ్డి గారి వ్యక్తిత్వం తీర్చిదిద్దబడింది. "ఆనాడు కళాశాలలో షేక్స్పియర్ పాఠము తప్ప మరో పాఠము చెప్పే వాడుకలో లేదు"[1] ఆంగ్ల సాహిత్యంతో పరిచయం ఆ విధంగా కలిగింది ఆనాటి పరిస్థితుల్లో విదేశీయుల ప్రభావాన్ని డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు— "నాటి పండితులకు పాశ్చాత్యులతోగల సన్నిహితత్వము, దేశములో నూతన వాతావరణము సృష్టించి పాశ్చాత్య విద్యాపద్ధతుల యందును, విజ్ఞాన సంస్కృతుల యందును దేశీయులకు కుతూహలమును బుట్టించెను ఈ కుతూహలము పాశ్చాత్య భాషా సాహిత్యముల పఠనమునకు దారితీసి, తద్వారమున ఆంధ్ర సాహిత్యసంస్కృతులపై ప్రభావమును నెరపెను'[2] అని అభిప్రాయ పడినారు ఈ విధంగా పడిన ప్రభావం 19వ శతాబ్దపు రచనలలో ప్రతిబింబించింది అయితే యిది "...భాషా సంబంధి అయినంతగా భావ సంబంధి కాదు విజ్ఞాన సంబంధి అయినంతగా సాహిత్య సంబంధి కాదు"[3] అని ఈ ప్రభావం ఫలరూపంలో 19వ శతాబ్దం లోనే లభించిందని, "మేధావులైన భారతీయ రచయితలందరు, పాశ్చాత్య సాహిత్య సంస్కృతులకు గల వైవిధ్యమునకు ముగ్ధులై తమ భావనాప్రపంచమును. రచనా క్రమమును తీర్చిదిద్దుకొనుచు వచ్చిన కాలమునూ యిదియే. ఈ విధంగా ఈ కాలమొక సంధియుగమని"[4] అన్నారు. ఈ యుగ ప్రభావమే కట్టమంచి వారిపై పడి స్ఫుటంగా వారి రచనల్లో కన్పించింది.

పెట్టి ఆ తరువాత కవులకు మార్గ దర్శకులయ్యారు. 'ఖండకావ్యం' గా ప్రాచూర్యం లోకి వచ్చిన కావ్యరూపానికి ఆపేరు పెట్టడం రెడ్డిగారికి నచ్చక పోవడంలో కూడా పాశ్చాత్య ప్రభావమే గోచరిస్తుంది "ఖండ కావ్యమనుమాట నిర్దుష్టము- కాదని నా యభిప్రాయము ఆభాసమన్నను తప్పులేదు. ఖండము అను పదముచే అసమగ్రము, అసంపూర్ణము ఇత్యాది భావములు స్ఫురించెడిని...... ఖండకావ్యం తనంతట తనే పరిపూర్ణము. ఇంకొక కృతి యొక్క విభజనము కాదు; విచ్ఛిన్నము కాదు. ఆంగ్లమున 'షార్టర్ పోయెమ్స్' (Shorter Poems) అను నభిధానమునకు 'ఖండ కావ్యములు' అనునది మనవారిచే చెప్ప బడిన పర్యాయ పదము కాఁబోలు: షార్టర్ పోయెమ్స్ అన్నారు కాని, పార్షల్ పోయెమ్స్ (Partial Poems) అని యెవరును చెప్పలేదు. చిన్నవి, పొట్టివి, హ్రస్వములు, లఘువులు, దీర్ఘములు కానివి — ఇత్యాది విధముల నిరూపించుటయ సరి. అర్థము నిండుగా, మెండుగా, లేనిది కావ్యము కానేరదు. అట్టి యర్థమును, భావమును అజా శ్వాసముల గ్రంథము గానే వ్రాయ వలయుననుట కవిత్వము యొక్క విధి కాదు. వామనావతారము సైతము విష్ణువే. రసాత్మకమైనది ఒక వాక్య మైననుఁగావ్యమే'' [7] కట్టమంచి గారి అభిప్రాయం అలా ఉన్నప్పటికీ సాహిత్య లోకంలో ఖండ కావ్యం అనే పేరే ప్రాచుర్యం లోకి వచ్చింది.

కట్టమంచి వారు తెచ్చిన మరో నవ్యత 'ముసలమ్మ మరణము' కావ్య నిర్మాణంలో సాంఘిక కథను ఎన్నుకొని సంఘజీవితాన్ని వర్ణించడం. ఈ కావ్యానికి పూర్వం సాంఘిక కథతో కూడిన కావ్య నిర్మాణం మన సాహిత్యంలో లేదు. 'కళాపూర్ణోదయం' వంటి కల్పిత కథలున్నా అవి పరిపూర తను పొంది లేవు.

'ముసలమ్మ మరణము' కావ్యాన్ని తాను స్త్రీల కొరకు రచించినట్లుగా రెడ్డి పేర్కొన్నారు ఆంధ్ర సాహిత్యంలో ప్రబంధాల్లో స్త్రీ కోల్పోయిందేమిటో గ్రహించి, స్త్రీ స్థానాన్ని సంఘంలో సముద్ధరించాలని తలంచి, వారు ప్రజా క్షేమానికై చేయగల అఖండ త్యాగంతో కూడిన కథను ఎన్నుకున్నారు. ఈ కథ అనంతపుర మండల సమీపంలో బుక్కరాయ సముద్రానికి చెందింది. ఆ ప్రాంతంలో ఈ కథ ఇప్పటికీ ప్రచారంలో ఉంది 'ముసలమ్మ'ను గ్రామ దేవతగా పూజించడం ఆయనలోని స్త్రీ పక్షపాతానికి గట్టి బలాన్ని కూర్చింది.

ఈ పల్లెపట్టుల్లోని స్త్రీత్యాగమయ జీవితాన్నెన్నుకోడానికి ఆంగ్ల కవి వర్డ్సువర్త్ మార్గ దర్శకుడయ్యాడు కట్టమంచికి. జర్మన్ నుండి తెచ్చుకొన్న రొమాంటిసిజమ్ ఆంగ్ల సాహిత్యంలో వర్డ్సువర్త్ చేతిలో సంపూర్ణ స్వరూపాన్ని పొందింది. ప్రకృతి ప్రీతి యుగ ప్రభావంగా మారింది. యుగప్రభావం చేతనే కట్టమంచి తన రచనల్లో కథాగమనానికి పరిపోషకాలైన వర్ణనలను మాత్రమే ఎన్నుకున్నారు. 'భావి' కవిత్వమైన భావ కవిత్వంలో 'స్త్రీ' ప్రకృతి దేవతగా. ప్రకృతి స్వరూపిణిగా పూజింప బడుతుందన్న విషయానికి సూచనగా, తన కావ్యాన్ని నాందిగా ఆంధ్ర సాహిత్యానికి అర్పించారు. అప్పటికి సంస్కరణ దృష్టి అంతగాఢంగా లేదు. 'ముసలమ్మ మరణము' ఖండ కావ్యాన్ని కళా దృష్టితోనే రచించారు. ఈ కావ్యాన్ని గురించి వ్రాస్తూ పింగళి లక్ష్మీకాంతం గారు "తెనుగులో స్త్రీ పాత్రకు ప్రాధాన్య మిచ్చి వ్రాసిన కావ్యములు చాల తక్కువ...... ఈ కావ్యములోని ముసలమ్మ పాత్ర యతినిపుణముగా జిత్రిత మైనదే గాని వర్ణితమైనది గాదు''[8] అని దీనిలోని నవ్యతను పేర్కొన్నారు.

## ప్రాచీన కావ్యాలు-ప్రేరణాలు

కట్టమంచి రామలింగారెడ్డిగారికి 'మహాభారతం' అభిమాన గ్రంథం. తిక్కన గారి భారతం వీరికి నిరంతరారాధ్య దేవత ఆయన దృష్టిలో కవి బ్రహ్మ కారణజన్ముడు, కవితా ప్రపంచ రవి. చిన్నతనం నుండి కట్టమంచి చేసిన సాహిత్యాధ్యయనంపై తిక్కన ప్రభావం అధికం. తిక్కన కావ్యకళా కౌశలాన్ని, సూరన 'కళాపూర్ణోదయం' లో చూసారుకట్టమంచి. కళాపూర్ణోదయం ఆయనకు నచ్చడానికి కారణం రొమాంటిసిజమ్ లోని 'స్వతంత్ర సృష్టి' అనే దృక్పథమే. గతాను గతికంగా సాగిపోతున్న ప్రబంధ సాహిత్యంలా కాకుండా స్వతంత్ర కల్పనతో కావ్య సృష్టి చేసాడు సూరన. ఆకావ్యంలో సూరన చూపిన ఐకలక్ష్యణాన్ని మెచ్చుకున్నారు రెడ్డి.

ఆంధ్ర సాహిత్య విమర్శ రంగంలో 'అభిరుచివిమర్శ' అనే సరికొత్త సాహిత్య లక్షణంతో కట్టమంచి వెలువర్చిన గ్రంథం 'కవిత్వ తత్త్వవిచారము' ''...తానేర్పరచుకొన్న సాహిత్య దృక్పథం తో, ప్రమాణ సూత్రాలతో కావ్యాలలో కవిత్వాన్ని, కావ్యగుణ దోషాలను అనుశీలించే పద్ధతి"[9] రొమాంటిసిజమ్ కాలంలో వ్యాప్తిలోకి వచ్చింది. దీనినే అభిరుచి విమర్శ (Impressionistic criticism) అన్నారు. కళాపూర్ణోదయం, ప్రభావతీ ప్రద్యుమ్నం

కావ్యాలపై కట్టమంచికి ఉన్న ప్రత్యేకాభిమానం, లక్షణగ్రంథాల ఆవరణలోనే రచించ బడిన ప్రబంధాలపై కలిగిన ఏహ్యాభావం ఈ అభిరుచి విమర్శను తెలుగులోకి తీసుకు రావడానికి కారణమయ్యాయి. ఆంధ్ర సాహిత్యంలో ఈ గ్రంథ ప్రాముఖ్యాన్ని తెలియచేస్తూ:

"కట్టమంచిలో కాల్వాని కోద్యమ ఆవేశమే కన్నులకు కట్టినట్లు కన బడుతుంది. వర్డ్స్‌వర్త్ వీరగీతాలకు వ్రాసిన పీఠికలాగా, కట్టమంచి కళాపూర్ణోదయం పీఠికా, షెల్లీ వ్రాసిన 'A defence of Poetry' లాగా కవిత్వ తత్వవిచారము తెలుగులో ప్రామాణికత్వం గడించింది"[10]

అని డా॥ జి వి. సుబ్రమణ్యం గారు పేర్కొన్నారు.

ప్రాచీన సాహిత్యంలో విమర్శ లక్షణ గ్రంథాలను ఆశ్రయించి ఉంది. భరతుని నుండి ఆనందవర్ధన, జగన్నాథుల వరకు వారు ప్రతిపాదించిన సాహిత్య లక్షణాలకు అనుగుణంగా కావ్య నిర్మాణం చేసారు. ఆ లక్షణాల పరిధిలోనే కావ్యాన్ని గూర్చిన చర్చ జరిగేది. కాని ఒకే కావ్యాన్ని గైకొని గుణ దోషవిచారణ చేసే పద్ధతి 'కవిత్వ తత్వవిచారము' నాటికి లేదు. తానెన్నుకొన్న కావ్యపరిశీలనకు కొన్ని సాపేక్ష ప్రమాణాలను నిర్ణయించుకొని ఆ పరిధిలోనే ఆలోచించడం నవీన దృక్పథం. ఇంత వరకూ ప్రాచీన లక్షణ గ్రంథాల్లోలేని మరికొన్ని సాహిత్యలక్షణాలను ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తెలుగులో ప్రవేశపెట్టారు. "విపరీతాలంకార రచనకు ప్రేరకము భావ శూన్యత"[11] అని, కావ్యంలో విషయం, శైలీ రెండు ప్రాముఖ్యాన్ని కలిగి ఉన్నాయని తెలుగులో మహాభారత రచన ప్రాశస్త్యాన్ని గురించి ఈవిధంగా తెలియ చేసారు:

"......ఈ దేశంలో నొక్క యాంధ్రులకు దప్ప దక్కిన యందఱకును రామాయణమందుగల యభిరుచి భారతమున లేదు. మన కన్ననో భారతము ప్రాణము. ఈ వ్యత్యాసమునకు కారణమేమి ? ఆంధ్రమున భారత రామాయణాదులకు గలశైలీ తారతమ్యమే."[12]

భావనా శక్తి, నాటక కౌశలముల యొక్క ప్రాముఖ్యతను గురించి చెబుతూ "కేవల కల్పితములైన వానింగూడ సాక్షాత్కారముందాల్చిన చేతన ములం జేయంజూచునది కావున భావనాశక్తి నాటక కౌశలంబుతో నను

సంధించి యుండును. అనగా నాటక రచనాశక్తి యున్నంగాని కావ్యములు సైతము యదార్థములుగ గన్పింపవు'' [13] ఇందులోని నాటక కౌశలం తత్పూర్వ కావ్యాల్లో కానవచ్చినప్పటికీ, భావనాశక్తిని గూర్చి చెప్పు సాహిత్య లక్షణం యింతవరకు మన సాహిత్యంలో లేదు. ఆంగ్ల సాహిత్యంలోని 'Imagination' అన్న పదానికి తెలుగే 'భావనాశక్తి.' 'Imagination' ను గురించి ఆంగ్ల విమర్శకులు లాంబ్, లేహంట్, కాలిరిడ్జ్ మొదలైనవారు చర్చించి ఒక సిద్ధాంతం వ్యాప్తిలోకి తెచ్చారు. కాలిరిడ్జ్ కవిత్వానికి భావనాశక్తిని ఆత్మగా పేర్కొన్నారు. అదే భావాన్ని 'కట్టమంచి' "కవిత చేయు మహేంద్రజాల కౌశల్యమున కాధారమైన గుణము భావనాశక్తి'' [14] అని వివరిస్తూ దాని ప్రకృతిని:

"భావనాశక్తి యనేక మాయలంబన్ను లీలావినోదిని. ఈ మాయలన్నిటికీ సామాన్య లక్షణమొక్కటియే ఏ రసమునుత్పాదింప జూచునో దానిని కవియే మనఃపూర్వముగ దాల్చిన గాని చదువరుల యందు అభిమతమగు చిత్త విభ్రమము గలుగనేరదు.''[15]

అని తెలియచేసారు. ఈ 'భావనాశక్తి' అన్న పదం తరువాతి విమర్శకుల విమర్శల్లో విస్తృతంగా చోటు చేసుకుంది.

సర్వ లక్షణ సమేతముగా వస్తువుల నిర్దేశించుట తప్పనీ, మానవ జీవిత మిశ్ర స్వభావం ఆదర్శణీయ మని కట్టమంచి అభిప్రాయం. 'కళ కళ కొరకే, (Art for Art's sake) అనేది ఆస్కార్ వైల్డ్ సిద్ధాంతం. అంటే కళాకారునికి నిర్బంధాలు, పరిమితులు, ఆకాంక్షలూ ఉండకూడదనే అభిప్రాయం ఈ సిద్ధాంత లక్షణం. ఈ అభిప్రాయ ప్రభావంతోనే కట్టమంచి నీతికి, కవితకు సంబంధం లేదని:

"తుదకు గోప్యములం బచ్చిగా వర్ణించినను నీతిశాస్త్రముంబట్టి ఖండించుట తెలివి తక్కువ. మఱి రసభంగమా ! కాదా! యనుటయే శిల్ప విమర్శనము యొక్క ఒక పరీక్ష. తక్కిన పరీక్షలిట యధిక ప్రసంగములు. ఆభాసములు.'[16] అంటాడు.

కవితాభివ్యక్తిలో కవి స్వేచ్ఛను పరిపుష్టం చేసే సిద్ధాంతం యిది. ఈ స్వేచ్ఛాభిలాష 'రొమాంటిసిజమ్' మౌలిక లక్షణం కావడం విశేషం. దీని ప్రభావమే కట్టమంచి సిద్ధాంత స్వభావమైంది.

ఈ విధంగా అనేక నూత్న భావాలను విమర్శలో ప్రవేశపెట్టి సరికొత్త తెలుగు విమర్శను సృష్టించారు. కట్టమంచి వారి కృషిని గురించి డా॥ జి. వి సుబ్రహ్మణ్యంగారు ఇలా అన్నారు

"......పాశ్చాత్య ప్రమాణాలను ప్రాచీనాంధ్ర కావ్యానుశీలనంలో ప్రయోగించి విమర్శప్రస్తారాన్ని సాగించారు. ఆ అభినవ దర్శనంలో సజీవ విమర్శ ఆవిర్భవించింది కావ్యంలో ఆత్మభూతమైన కవితాతత్త్వం కేంద్రంగా కావ్యనిర్మాణాన్ని వివేచించాలన్న వివేకం కట్టమంచి వారు తెలుగు విమర్శకు నేర్పారు."[17]

'కవిత్వ తత్త్వ విచారము' ఆంధ్ర సాహిత్య విమర్శా రంగంలోకి ప్రవేశించిన తరువాత అనేక ఖండన మండనలకు గురైనప్పటికీ, తెలుగు విమర్శకు ప్రామాణిక గ్రంథంగా నిలిచింది. కట్టమంచివారు తెలుగుకు సృజనాత్మక విమర్శను నేర్పారు. "కాలానికిఅవసరమైంది కట్టమంచి విమర్శ".[18]

# 3

# నవ్యకవితా ఉషోరేఖ ముసలమ్మ మరణం

క్రీ.శ 1899వ సం॥లో 'శ్రీ మదాంధ్రభాషాభిరంజనీ సమాజము' వారు నిర్వహించిన పోటీకై కట్టమంచి రామలింగారెడ్డి రచించిన ఖండ కావ్యం 'ముసలమ్మ మరణము, తరువాత సం॥ అంటే 1900 సం॥లో యిది ప్రచురింపబడింది. ఈ కావ్యం తత్పూర్వ కావ్యాల కంటే కొన్ని విష యాల్లో విలక్షణతను ప్రకటించి విశిష్టతను పొందింది. దీనిని విశదీకరిస్తే- ఈ కావ్యానికి మౌలికమైన వస్తు గ్రహణంలోనే ఆ విలక్షణ స్వభావం గోచరిస్తుంది. గ్రహించిన వస్తువును, గతాను గతికంగా సాగిపోతున్న కావ్య రచనా స్వభావాన్ని దారి మళ్ళించి, ఈ కావ్యంలో ఆధునిక కవితా స్వరూ పానికి పాదులు వేశారు కట్టమంచి.

'ముసలమ్మ మరణము' లోని కథను బ్రౌను దొరచే ప్రకటింపబడిన 'అనంతపుర చరిత్రము' నుండి గ్రహించినట్లుగా కట్టమంచి వారు పేర్కొ న్నారు. అయితే ఉన్నది ఉన్నట్టుగా గ్రహించి వ్రాస్తే అది చరిత్రే అవు తుంది. కాని కవిత కానేరదు. అందులో కవితా గుణం గోచరించదు. ఈ మెలకువతోనే కట్టమంచి తాను ఆ కావ్యంలో సాధించదలచుకొన్న 'కరుణ రసపోషణ'కు అనువైన కల్పనలు చేసుకున్నారు. కావ్య రమణీయతకు, పాత్ర చిత్రణకు పరిపోషకమైన మార్పులు చేర్పులు చేసారు.

కట్టమంచి వారు ఈ కావ్యాన్ని ముఖ్యంగా స్త్రీల కొరకు రచించి నట్లుగా 'కావ్యముఖ పత్రం'లో తెలిపారు. ఆనాటికి స్త్రీ పాత్ర ప్రాధాన్యంతో

వచ్చిన కావ్యాలు మృగ్యమే అని చెప్పాలి. ఒకేసారి సంప్రదాయాన్ని పక్కకు నెట్టి ఒక సాంఘిక ఇతి వృత్తాన్ని మలచడంలో ఆయనలో ఉన్న సంస్కారమే అందుకు దోహదం చేసింది. పాశ్చాత్య ప్రభావం ఆయనపై అధికంగా ఉంది. ఫ్రెంచి విప్లవం తర్వాత యూరోపియన్లు స్త్రీ శక్తికి పట్టం కట్టి సమాదరించారు. ఇది కట్టమంచి వారి ప్రవృత్తికి దోహదం చేసింది. ఈ ప్రభావం ఒక నూత్న కావ్యా విర్భావానికి దారి తీసింది.

ప్రబంధాలలో మితి మీరిన శృంగార రచనా క్రమాన్ని కవిత్వ తత్త్వవిచార' గ్రంథంలో సోదాహరణంగా విశదీకరించారు. ఆధునిక కవిత్వా నికి లక్షణ గ్రంథ స్థాయిని సంతరించుకున్న 'కవిత్వతత్త్వవిచార' గ్రంథాన్ని రాయడానికి పూర్వమే 'ముసలమ్మ మరణము' కావ్య రచన చేసారు. అయితే తన మనస్సులో ప్రబంధాలపై బీజ ప్రాయంగా ఉన్న విమర్శనాత్మకమైన ఆలోచనలే ఈ కావ్యరచనకు హేతువులయ్యాయి. పూర్వలాక్షణికులైన భరతుడు, భామహుడు, దండి, వామనుడు, ఆనంద వర్ధనాదులు తమ తమ మత స్థాపనకై లక్షణ గ్రంథాలు రచించారు. భరతుడు నాట్యశాస్త్రాన్ని, దండి కావ్యాదర్శాన్ని, ఆనంద వర్ధనుడు ధ్వన్యాలోకాన్ని రచించడం జరిగింది. ఈ లక్షణ గ్రందాలు అంతఃపూర్వమున్న లక్ష్యాల్ని కొంత అను సరించినవే. సహజమైన పద్ధతిలోనే లక్ష్య గ్రంథం ముందు వెలువడి లక్షణ గ్రంథం దానిని అనుసరించింది. కవిత్వతత్త్వ విచార గ్రంథంలో కట్టమంచి పేర్కొన్న కావ్యలక్షణాలు చాలా వరకు మనకు ఈ కావ్యంలో స్పష్టంగా గోచరమవుతాయి.

## వస్తు నవ్యత

'సమష్టి'కై 'వ్యష్టి' ఆత్మబలి యొసగిన కరుణ రసాత్మకమైన కథ"[1] ఈ కావ్యంలోని ఇతివృత్తం. పూర్తి కల్పిత వస్తువేమీ కాక ఒకానొక చారిత్రికాంశం ఆధారంగా నిర్మింపబడిన కావ్యం. అంత వరకు ప్రబంధాల్లో స్త్రీ 'బాహ్య సౌందర్యం' అతిలలితంగా వర్ణింపబడుతున్న శృంగారనాయిక స్థానంలో ''ఆత్మ సౌందర్యం'' జీవంగా గల నాయికను ప్రవేశపెట్టిన

ఘనత కట్టమంచి వారికే దక్కింది. ఆ తరువాతి కాలంలో భావ కవిత్వంలో ప్రణయదేవతగా, ప్రకృతి స్వరూపిణిగా పూజించబడిన 'స్త్రీ'ని, నాందిగా తన కావ్యంలో ఉన్నత స్థానాన్ని అధిష్టింప చేసి, సంఘంలో 'స్త్రీ'కి కలిగిన ప్రాధాన్యాన్ని ఆవిష్కరించారు.

కట్టమంచి వారికి వీరగాథలపై ప్రత్యేకాభిమానం ఉంది. 'బాలనాగమ్మ కథ', 'రాజాదేసింగు చరిత్రము' మొదలగు వానిలో పాండిత్య ప్రభావం కంటే భావనాశక్తి అధికం కావడం ఆయన అభిమానానికి కారణాలు. ఈవిధంగా భావనాశక్తి బలంగా ప్రతిబింబించే జానపదగేయాలు తెలుగు సాహిత్యంలో కోకొల్లలు. ముసలమ్మమరణము వంటి కావ్యకథనే పూర్వం "......జానపద కవి 'కాకమ్మకథ' యను పేరుతో కరుణామయముగా రచించెను."[2] రాళ్ళపల్లి వారి కుమారుడు జయంత 'ముసలమ్మమరణము' వంటి కథ కన్నడ జానపద గేయాల్లో ఉందని చూపించారు. ఈ రెంటిని గురించి చర్చిస్తూ "ఇటువంటి సన్నివేశమే నేపథ్యంగా గల ఒక సీమంతిని విషాదగాథ (కెరెగహార) ఈ కన్నడ గేయం 'కెరెగహార' అంటే చెరువుకు ఆహారం"[3] అని అర్థం అంటూ కన్నడ జానపద సాహిత్యంలోని ఒక జానపద కథకు, ఈ కావ్య కథకు పోలికను చెప్పారు. వీరగాథలను అభిమానించే రామలింగారెడ్డి దృష్టికి ఈ జానపద గాథలు కూడా వచ్చి ఉండవచ్చు. ఈవిధంగా ఈ కావ్యం నిర్మాణంలోను, వస్తు గ్రహణం, పాత్ర చిత్రణం, వర్ణనా విధానంల్లో నవ్యత కలిగిఉంది.

'ముసలమ్మమరణము'లోని కథ మరణాంతం. 'మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతానిచ' అన్న ఆర్యోక్తికి భిన్నంగా ఉందని, లోక కళ్యాణార్థమై జరిగిన ఆత్మబలి వలన అసంఖ్యాక జనావళికి మంగళం జరగడం వల్ల దీనిని మంగళాంతంగానే పరిగణించాలని డా॥ సి. నారాయణ రెడ్డి తమ "ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు ప్రయోగములు" అన్న సిద్ధాంత గ్రంథంలో పేర్కొన్నారు. ఇది విషాద కావ్యమైనప్పటికీ 'షెక్స్పియర్' నాటకాలలో విషాదానికి కారణమైన 'ట్రాజిక్ ఫ్లా' (Tragic Flaw) యిందులో లేదు. లోక కళ్యాణార్థమై తానే ఆత్మత్యాగానికి సిద్ధపడిన వనితగా 'ముసలమ్మ' పాత్ర చిత్రణ జరిగింది.

'ముసలమ్మ మరణము' కావ్యం చిన్న కథా కావ్యం. చిన్న కావ్యమైనంత మాత్రాన రస నిర్వహణలో ఏ మాత్రం లోటు రాలేదు. విషయం ఉదాత్తమైనదైతే మహాకావ్యం గాను, క్షుద్రమైనదైతే ఖండ కావ్యంగానూ ఉంటుందనే అభిప్రాయం, ఈ కావ్యం విషయంలో సరికాదేమో అన్పిస్తుంది. దీనిలో విషయం ఎంత ఉదాత్తమైనదో వ్యక్తీకరణ అంత సూటిగా ఉంది. అనవసర వర్ణనలతో పొడిగింపులేదు. సంగ్రహంతో సమగ్రత దెబ్బతినలేదు. ఈవిధంగా ఔచిత్యం పోషింపబడింది. విషాదాంత స్వభావాన్ని గురించి, సాంఘికేతి వృత్తాన్ని గురించి డా॥ సి. నారాయణరెడ్డి గారు "ఎట్లయినను ఈ రెండు లక్షణములా కాలమున నవ్యతా నిర్భరములే"[4]అని పేర్కొన్నారు.

## మూలకథ-మార్పులు

బుక్కరాయ సముద్రమనే పల్లెలోని ప్రజలకు జీవనాధారం ఆ పల్లె నానుకొని వున్న చెరువు. ఒక సంవత్సరం అతి వృష్టిచేత చెరువు నిండి గండిపడే పరిస్థితి ఏర్పడుతుంది. గండిపడితే ఊరి ప్రజలకు 'ముప్పు' ఆసమయంలో ఆ పల్లె ప్రజలను గ్రామ దేవత అనుగ్రహించే విధంగా నరబలి యివ్వండని ఆకాశవాణి పలుకుతుంది. ఇందుకు బసిరెడ్డి ఏడోకోడలు ముసలమ్మ' సిద్ధమై, తన ఆత్మార్పణ ద్వారా ఆ గ్రామాన్ని ఒక పెద్ద ఉపద్రవం నుండి కాపాడుతుంది. ఇది సంగ్రహంగా ఈ కావ్యంలోని కథ.

మూల కథలో 'ముసలమ్మ'నే బలి ఇవ్వాలని ఆకాశవాణి కోరదు. కాని అలా కాని పక్షంలో ఎవరూ ముందుకు రారని గ్రహించిన కట్టమంచి ముసలమ్మ పేరునే పలికించారు. ఇది మొదటి మార్పు కాగా 'ముసలమ్మ'ను ఒక పసిబిడ్డ తల్లిగా చిత్రించడం ద్వారా ఆమె యందు మనకు ఎంతో దయ కలిగించడంతో ఆమె పాత్ర చిత్రీకరణలో కవి జీవకళని నింపారు. ఆత్మార్పణకు సిద్ధమైన తన నిర్ణయాన్ని అందరిచేత ఒప్పించడంలో తన సహజ గాంభీర్యాన్ని, వాక్చాతుర్యం; ఎదుటి వాళ్ళను ఒప్పించి తటాకంలో లీనం కావడం ద్వారా ఆత్మార్పణ చేసుకోవడం రెండో మార్పు. మూల కథలో ముసలమ్మ గండిపడిన చోట కూర్చుంటే, ఆ గండిని అక్కడున్న వారు రాళ్ళతోనూ, మట్టితోనూ పూడ్చారు. కాని కట్టమంచి వారు ఆ సన్నివేశాన్ని

ఆమె జలప్రవేశం చేయడంగా మార్చడం ద్వారా ఒక బీభత్స దృశ్యాన్ని తప్పించి గంగాభవానిలో ఆమె కలిసిపోయే సన్నివేశాన్ని కరుణరస ప్లావితంగా చిత్రించి మన మనస్సులను ద్రవింపచేసారు. గురజాడ వారి పూర్ణమ్మ ప్రభావంతో వ్రాసిన తమ 'ముసలమ్మ"లో చిలుకూరి నారాయణ రావు ముసలమ్మ మరణాన్ని మరో విధంగా చిత్రించారు. అందులో ఆమె కత్తితో పొడుచుకుని చనిపోయినట్టుగా రూపొందించారు. కాని కట్టమంచి వారు చేసిన మార్పులో ఉన్న 'ఉదాత్త చిత్రీకరణ' యిందులో గోచరించదు.

ఈ కావ్య శీర్షికను 'ముసలమ్మ మరణము' అని నిర్ణయించడం ద్వారా ముందుగానే యిందలి కథ విషాదాంతమనే అభిప్రాయం కలుగుతోంది. స్త్రీ పాత్ర ప్రాధాన్యాన్ని తెలియజేస్తోంది. ''కవి పండితుల విమర్శకు గురి కావలసి వస్తుందేమో అన్న భయం ఏ మాత్రం లేక సాహిత్య పరిధిని పెంపొందించే 'నిమిత్తం ఈ వినూత్న మార్గాన్ని రెడ్డి గారు అనుసరించి ఉండవచ్చు.''[5] అనే అభిప్రాయం యిక్కడ సమర్ధనీయంగా కన్పిస్తోంది.

## 'ముసలమ్మ పాత్ర'

'ముసలమ్మ మరణము' కావ్యంలో 'ముసలమ్మ'ముఖ్య పాత్ర. ''మిగిలిన పాత్రములెల్ల బంగారము వంటి యామె బ్రదుకునకు ఒఱగల్లులు మాత్రమే'' కావ్య నిర్మాణం స్త్రీలకొరకే చేయబడి, కథకూడా ముసలమ్మ పాత్ర ననుసరించి ఉంది కాబట్టి ఆ పాత్రకు ప్రాధాన్యత చేకూరింది. ముసలమ్మ పాత్ర చిత్రీకరణ పాఠకుల చిత్తవృత్తిలో కలకాలం నిలిచి ఉండేలా జరిగింది. కట్టమంచి వారికి నాటకీయ శైలిపై అభిమానం ఎక్కువ. అందుకే కవిత్వ తత్వ విచారంలో ''కేవల కల్పితములైన వానింగూడ సాక్షాత్కారము దాల్చిన చేతనంబులం జేయం జూచునది కావున భావనాశక్తి నాటక కౌశలంబుతో నను సంధించి యుండను అనగా నాటక రచనాశక్తి యున్నంగాని కావ్యములు సైతము యథార్థములుగ గన్పింపవు.''[6] అని పేర్కొన్నారు. నాటకీయశైలిని మెండుగా అభిమానించిన వాడు కాబట్టే కవిత్రయంలో తిక్కన ఈయనకు అభిమాన కవి అయినాడు ప్రబంధ కవులలోసూరన చూపిననవ్య

తయే నవ్య మార్గ ప్రవర్తకుడైన కట్టమంచిని ఆకర్షించింది. తిక్కన, సూర నల కవిత్వాన్ని హృదయం నిండా ఆస్వాదించిన కట్టమంచి తిక్కనలోని నాటకీయ శైలిని, సూరనలోని పాత్ర చిత్రణా నైపుణ్యాన్ని అపూర్వంగా సాధించారు తన కావ్యంలో.

ముసలమ్మ పాత్ర నిర్మాణాన్ని ఆచార్య పింగళి లక్ష్మీకాంతం "పాత్ర వర్ణన యనగా దాని గుణగణము నంతయు గని, తానై యొక్కచో జెప్పు నుట పాత్ర చిత్రణమనగా గాథా కార్యవశమున ఆపాత్రల యొక్క స్వరూప స్వభావములు స్వయం వ్యక్తమగునట్లు చేసిన పాత్రలే సజీవములనియు, ఆసజీవతయే మూర్తీభవించిన కవి సృజన శక్తియనియు జెప్పుదురు. ఈ కావ్యంలోని ముసలమ్మ పాత్రయతి నిపుణముగా జిత్రితమైనదేగాని పూర్వ పద్ధతిని వర్ణితమైనది గాదు. ఈ రచనకు శోభ కలిగించిన విశేషములలో ఈ పాత్ర చిత్రణ కౌశల మొకటి."[7] అని అభిప్రాయ పడ్డారు.

కట్టమంచి పాత్రల స్వభావాన్ని గురించి చెబుతూ "వికృతులు లేని పాత్రములు జడసమానములు"[8] అని పేర్కొంటూనే "ప్రబంధాలలోని స్త్రీ, పురుషులెండిన కట్టెల వలె ఉన్నారు. వంగలేరు, పెరుగలేరు. కాబట్టి ప్రాప్తులు రెండు విఱువబడుట, ప్రౌయినిడుట"[9] అనినిశితంగా విమర్శించారు; కాబట్టే తాను సృష్టించే పాత్ర 'సజీవ పాత్ర' కావాలని తిక్కన మార్గంలో పయ నించారు.

ముసలమ్మ పాత్ర చిత్రీకరణలో కట్టమంచి రెండు మార్గాల నెన్ను కున్నారు ఆ పాత్ర స్వభావాన్ని ఆకట్టుకునేలా చేయడంలో ఈ రెండూ ఉత్తమ మార్గాలయ్యాయి. ఈ పద్ధతుల్లో తప్ప కవి ఎక్కడా తనకు తానై జొరబడి కథాగమనానికి అడ్డు రాలేదు.

గ్రామస్థుల దృష్టిలో ముసలమ్మ సౌందర్యం, జీవకారుణ్యం, బంధు ప్రీతి, ప్రేమానురాగం ఇత్యాది గుణాలన్ని కలిగి ఉంది.

"సుదతీమణి కడుమెత్తని
హృదయాబ్జము గలది, పసిది, యేమి యెఱుఁగ, దా
పదలం బడ దెన్నండును,
హృదయేశుని విడిచి పోవనెట్లోపు నాకో."

(ముసలమ్మ మరణము—34 వపద్యం)

ఇలాంటి ముసలమ్మను తమ సౌభాగ్యానికై ఆత్మార్పణం చేయవలసిందని ఎవరు మాత్రం ఎలా అడుగ గలరు? అందుకే ఎవరూ సాహసించ లేక పోయారు గుసగుసలతో గుండెలలో బాధతో విషయం చెప్పలేక సంశయి స్తున్న గ్రామస్థుల పరిస్థితిని అర్థం చేసుకుంది ముసలమ్మ.

గ్రామస్థులు ముసలమ్మతో ఎలా నివేదించాలా అని సందేహిస్తున్న విషయం ఎట్టకేలకు ఆమెకు తెలిసింది. తాను త్యాగం చేయాల్సిన అవస రాన్ని ఆమె గ్రహించింది. మారు మాటాడలేక పోయింది. ఆత్మత్యాగాన్ని తిరస్కరించ లేక స్వజనుల పీడలేక పడే ఆరాటం మధ్య నలిగిన చిత్త వృత్తితో ఆమె భర్త ముందు నిలిచింది. అప్పటి ఆమె మనస్థితిని కవి హృదయంగమంగా ఇలా వివరించారు.

"లేనగవును గన్నీళ్లును
గా, నెద తటతట యనంగఁ, గాంతుని యెదుటన్
వానయు నెండయుఁ గలిసెడు
చో నొప్పెడు నభమనంగ, సుందరి నిలిచెన్"

(44వ పద్యం)

విషయమంతా వివరించింది భర్తకు. తన సహజ వాక్చాతుర్యంతో కష్ట సమయంలో కూడా మగని నోటమాట పెగలకుండా చేసింది. పాంచ భౌతిక జగత్తులో భర్తకు తెలియనిది లేదని తాను చెప్పదలచుకున్న విషయాన్ని తన నోటనే వినాలని భర్త కుతూహల పడుతున్నట్టుగా:

"......సతుల మాటల న్వినఁగఁ గోరుట భర్తల రీతియేగదా."

(46వ పద్యం)

అని దుఃఖ సమయంలో కూడా తన గడుసు దనాన్ని ప్రకటించింది.

"అని, పూస గ్రుచ్చినట్లుగ
వనితామణి దెలిపె దేవి వార్తల రీతిన్,
జనముల కష్టము చందముఁ
దన పూన్కి తెఱంగు, వినయ తత్పరమతియై."

(47వ పద్యం)

ఊరివారి కష్టాలను గట్టెక్కించడమే ఆమె ధ్యేయం. 'తత్పరమతి'గా ఆమెను చెప్పినపుడు అది వినయానికి, పూనికకి విశేషణం. కాని పూనికకి చెబితే ఆమె నిశ్చయం మారదని స్పష్టమవుతోంది.

చలి పిడుగు లాంటి వార్తను విన్న భర్త తామర పాకు మీది జల బిందువు వలె అల్లాడిపోయాడు. ధైర్యాన్ని కూడ గట్టుకొని ఆ ఊరు విడిచి వెళ్ళిపోదామన్నాడు. ఆ సమయంలో ఉచితానుచితాలను త్రోసిపుచ్చి ఉద్వేగంతో తన బాధను వెలిబుచ్చాడు స్వార్థచింతన నుండి బయటపడి మరో అడుగు ముందుకు వేసి జీవిత పరమార్థాన్ని గ్రహించింది ముసలమ్మ. ముందు వినయంతో అనుమతి కోరింది. కర్తవ్య బోధ చేసింది. ఆత్మ త్యాగంలో ఉన్న ఆనందాన్ని పరమార్థాన్ని వివరించి ఐహిక సుఖాల్ని ఆశించి స్వార్థ చింతనలో కొట్టుకు పోవడం తగదంది.

> హేయంబైన ప్రపంచ సౌఖ్యములు మిమ్మేలాగునంగట్టె? నా
> థా! యత్యద్భుతమయ్యె, సంతతము నే దైవంబుగాఁ గొల్చు మీ
> రే యిట్లాడిన నేమి చెప్పనగు? నన్నిస్సారికిం "బోయి రా
> వే" యంచుందయఁ బంపవే; గుణనిధీ! యే నిన్నుఁ బ్రార్థించెదన్
>
> (56వ పద్యం)

చివరికి ప్రార్థించింది. 'వివేకనిధానా' అంది. అన్నీ తెలిసి క్షణ భంగురమైన జీవితం కోసం వివేకాన్ని కోల్పోవద్దని ప్రార్థించడంలోనూ పరుల సౌభాగ్యాన్ని ఆశించాలని భర్త గతంలో వ్రాసిన పద్యాలను అతనికే అప్పగించి అంగీకరింప జేయడంలోనూ ఆమె గడుసరి తనం మనకు అవగతమౌతుంది. ముత్తయిదువగా కన్ను మూయడంలో ఉన్న ఆనందాన్ని తెలిపింది.

> "మీరు కన్నారఁ జూచుచు గౌరవింపఁ
> గన్ను మూసికొనుట నాకు ఘనము కాదొ?
> తమకుఁ దమభార్య యిటు చేసెఁదగుఁదగునని
> యెల్ల వారును వర్ణింప నింపు కాదొ?"
>
> (68వ పద్యం)

సంప్రదాయంలో ఈ కోరికకు ఇక తిరుగు లేదు. మగని మనసు మెత్త బడింది. చిట్ట చివరికి భార్యను విడువలేని తన బేల తనంతో యింతకాలం తన మనసులో మూర్తీ భవించిన ముసలమ్మ గుణాన్ని కవి. ఈ విధంగా చిత్రించారు.

"తెలియును నాకును నీవ
న్యులఁ బోల వనియును, గొప్ప యొప్పిదములకున్
నెలవ వనియు, నే నీకుం
జలజానన తగననియును సత్యముగాఁగన్"

(74వ పద్యం)

ముసలమ్మ ప్రకృతిలోని మనోహరాకృతులు చూసి ఎల్లప్పుడూ ఆమె ఆనందాన్ని పొందేదని, దాని భావం తనకు యిపుడు స్ఫురించిదన్నాడు.ఆమె కూడా ఎపుడో ఒకపుడు ఆ ప్రకృతిలో కలిసి పోతుందనే అనుమానం అతని మస్తిష్కంలో మెదలాడేది. ముసలమ్మ భర్త ఈ విషయాన్ని చెప్పే సంద ర్భంలోని పద్యాన్ని రమణీయంగా వర్ణించారు కట్టమంచి.

తమ దాంపత్య జీవితంలో పెంచుకున్న అనుబంధంలో తాను చేసిన సేవకు ఫలితాన్ని అడగమని ఎన్నోసార్లు అలిగిన భర్తను హఠాత్తుగా కోరిన కోర్కె యిది. అడిగిన కోర్కెకు భర్త సమాధానం చెప్పకముందే "పలు పలు కేల నేబోయి వత్తు" అని చెప్పి పయనమైంది. భర్త మౌనాన్ని అర్ధాంగీ కారంగా గ్రైకొంది. కాని చిన్నతనం నుండి తల్లి దండ్రుల్లా పెంచిన అత్త మామలతో చెప్పడం కష్టమే అయినా 'మీ అనుజ్ఞాతనై పోయివత్తు" నంది. ముసలి తనం పైబడ్డ వాళ్ళను యింతకాలం ఎంతో ప్రేమతో కాపాడిన ముస లమ్మను వారు వీడలేరు. అందుకని వాళ్ళ మాటలతో వాళ్ళకే బంధంవేసింది

తల్లియుఁదండ్రియున్ గురువు దైవము నెల్లరుమీర; మీరలే
చెల్లఁగనియ్యరేని యిఁకఁ జెల్లునె నాదగు పూన్కి యెచ్చటన్
గల్లయొ సత్యమో యెఱుఁగఁ గణ్యతఁ దత్వముఁ దెల్పువేళ మే
నెల్లఁ బరోపకారమునకేయని పల్కితి; రట్లు చేసెదన్.

(91వ పద్యం)

పరోపకారానికి పాటు పడక
"......విడువక మేను పెంచి పెంచి
యేమి చేయంగఁ బోయిలోన నిడ నెయంచు."
(87వ పద్యం)

అంటూ పరోపకారంలో ఉన్న పరమార్థాన్ని తెలిపింది చిన్ననోట పెద్దమాట అనిపించినా, కష్టసమయంలో పెద్దలు కోల్పోయిన ధైర్యాన్ని ఆమెలో చూపించడంతో కవి ఔచిత్యాన్ని పోషించారు.

ఇప్పటి వరకూ కథానిర్వహణలో ముసలమ్మ పాత్ర చిత్రణ ఒక యెత్తు కాగా ఆ పై వర్ణన మరో ఎత్తు కొడుకుని చంకలోకి తీసుకుని

"అన్నపోర; నీకు నమ్మ యెక్కడిదింక?
తండ్రిగారిఁ గూడి తనరు మయ్య;
నన్నుఁ దలఁచి తలఁచి నాయనా యడలంగ
వలదు; పోయివత్తుఁ బంపు తండ్రి!" (93వ పద్యం)

ఇప్పటి వరకూ నిగ్రహించుకున్న ముసలమ్మ ఒక్కతే కాదు చలించడానికి, ఇక్కడికి చేరేసరికి అశ్రు నిబిడమై ఉన్న పాఠకునికి సైతం కంట నీరు జారక మానదు "విశేషించి ముసలమ్మ మరణమున శోభావహమైన మరి యొక్క గుణము మృదులమైన కరుణ రసపోషణ జంత్ర గానములో మ్రోతలేని నాదముకై (noise less sound) తంతిని గట్టిగా నొక్కి మీటెడి గాయకుని వలె, కరుణ భావావేశము పొంగి పొరలనీక నిగ్రహించి నడపగల కవికే దాని నిశితత్వమును సాధ్యమౌను." అన్న పింగళి లక్ష్మి కాంతం గారి వాక్యాలు ఈ సందర్భానికి చక్కగా సరిపోతాయి. చివరగా తనను పెంచిన ఋణాన్ని ఈ విధంగా తీర్చుకుంటున్నానని గ్రామస్థులతో చెప్పి జలప్రవేశంతో ఆత్మార్పణం చేసుకుంది.

ముసలమ్మ-భర్త, అత్త మామల సంవాదంలో వేదాంత వాసన ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. 'పాస్టోరల్ ఎలిజీ' మౌలిక లక్షణం-"ఆత్మ విషయాలతో బాటు జగత్పరమైన శాశ్వత సత్యములను గూడ ప్రకటించడం"[10] ముసలమ్మ చేసిన కర్తవ్య బోధలో వ్యక్తమైన అంశాలన్నీ ఈ కోవకు చెందినవే.

# వర్ణనలు-నవ్యత

ప్రాబంధికంగా వస్తున్న వర్ణనలు చేయకుండా కథా గ్రహణంలో, పాత్ర చిత్రణంలో చూపిన నవ్యతనే కట్టమంచి వర్ణనల విషయంలో కూడా చూపారు. వర్ణనల్ని గూర్చిన 'కవిత్వతత్త్వ విచారము'లోని అభిప్రాయాల్ని యిక్కడ పరిశీలించాలి ''వర్ణనములకన్న అంగాంగ సాంగత్యము కావ్యముల శ్రేష్ఠము,''11 ''పొత్తు పొసగని వర్ణనలు రసమునకు ప్రతికూలములు''12 అన్న అభిప్రాయాలకు ఈ కావ్యాన్ని లక్ష్య గ్రంథంగా భావించి అన్వయించి చూస్తే ప్రయోగంలో విభిన్నత ఎక్కడా గోచరించదు. ఈ కావ్యంలో కట్టమంచి చేసిన వర్ణనలు అతి స్వల్పం. అయితే అవి అక్కడక్కడ ప్రబంధ ఛ్ఛాయల్లో నడచినవైనా, కథాగమనానికి అడ్డురాలేదు. ఇందులోని వర్ణనల్ని రెండు విధాలుగా విభజించుకోవచ్చు.

పాశ్చాత్య ప్రభావ స్వభావంతో ఉన్నా కట్టమంచి ప్రకృతి చిత్రణలో ఏ పాశ్చాత్యకవినీ అనుసరించలేదు. రొమాంటిసిజమ్ యుగ ప్రభావంతోనే ప్రకృతి ప్రీతిని ప్రకటించారు. ప్రకృతి చిత్రణలో కట్టమంచికి ఉన్న అభిప్రాయాలివి.

వనవర్ణనలో ప్రాచీనులు నిఘంటుకారుల వలె పదాడంబరాన్ని ప్రయోగించారని, ఆకృతులను మనసులో సాక్షత్కరింపచేయడమే నిజమైన కవి లక్షణమని కట్టమంచి పేర్కొన్నారు. పాత్రలను వర్ణించు సందర్భంలో అవి సర్వ లక్షణ సమేతంగా నిర్దేశించడాన్ని ఖండించారు. మనశ్శాస్త్రతత్త్వం దృష్ట్యా దీనిని సమర్థించారు. ఇదే విధానాన్ని ప్రకృతిని వర్ణించే సందర్భంలో కూడా పాటించాలని ఆయన పేర్కొన్నారు.

"పాత్రములఁ బరిపూర్ణములుగా వర్ణించుట యెంత తప్పో వనాదుల సైతము 'సర్వలక్షణ సంపన్న'ములుగా వర్ణించుట యంత తప్పు''13

కావ్యాల్లోని వర్ణనల్ని యింత నిశితంగా పరిశీలించిన కట్టమంచి తన కావ్యంలో ప్రకృతిని ఏవిధంగా చిత్రించారో గమనించాలి.

# తటాక వర్ణన

బుక్కరాయ సముద్రమనే గ్రామ సౌందర్యాన్ని చిత్రిస్తున్న సందర్భంలో ఆ ఊరి చేరువలో ఉన్న తటాక వర్ణనయిది.

''చలదుత్తుంగ మహాగ్రభంగ పటలీసంఘట్టనారావ, ము
జ్జ్వల కూలాగ్రనటత్త రంగరవ, మంచన్మధ్య భాగభ్రమి భృ
త్కల సంపాతి మహోర్మి కానికర నిర్ఘోషంబునుం, గూడఁగా
నలరుఁ ఘోర సరస్సు దిగ్విదళన వ్యాపార పారీణమై.''

(20వ పద్యం)

కథలో తటాకానికి అధిక ప్రాధాన్యం ఉంది. అది మామూలు తటాకం కాదు. ఉగ్రరూపంలో ఉండి జనులను బలిగా తీసుకోడానికి సిద్ధమైంది. ఉపద్రవం తప్పడానికి ప్రతిఫలంగా నరబలి కోరిన భయంకర రూపం ఈ వర్ణనలో గోచరమై భావి కథా సూచన ప్రాయంగా ఉంది.

''అరుణోదయచ్ఛాయలాకాశ పథమున నంభోధరముల వేటాడు వేళ
మార్తాండ చండాతపార్తికి ననిలముల్ పొదరిండ్ల గుసగుసల్ వోవువేళ
సాయాహ్నలక్ష్మి కసూయ కలుగ భూమి తళుకు విరుల చీరఁదాల్చువేళఁ
బండు వెన్నెల తేఁడు కొండపై జలజల మని పాఱు నదిఁ దానమాడువేళఁ''

(75వ పద్యం)

ముసలమ్మ హృదయ సౌకుమార్యాన్ని వర్ణించడంలో కట్టమంచి ప్రకృతిని ఉపయోగించుకున్నారు. ప్రకృతిలోని మనోహరాకృతులన్నిటిని చూసి ఆమె పొందే తాదాత్మ్యం, ఏదో ఒకనాడు దానిలో ఆమె లీన మౌతుందనే భావన భర్తకు కలిగినట్టుగా కథాగతంగా చెప్పిన సందర్భంలోని పద్యమిది.

''ఉరుహారిద్రవపుఁజీర సాంధ్యరుచిగా నొప్పార, నానంద వి
స్ఫురితంబైన మొగంబు రక్తమయమై సూర్య ప్రభంబోల, శో
కరసాధీన జనాళి పుల్గుల క్రియం గాంక్షఁ మొఱల్ వెట్టఁదా
సరసీ రాజ మహాబ్ధికై చనియె విస్ఫారీ భవన్మూర్తియై.''

(100వ పద్యం)

సంధ్యా సమయంలో వచ్చే బంగారు కాంతి లాగా ఆమె చీర, సూర్యునిలా ఆమె మోము అరుణ వర్ణంలో తేజస్సుతో గోచరించింది. ముసలమ్మ బయలు దేరింది. ఊరి వారంతా శోకతప్తులై ఉండగా తాను మాత్రం 'మహాబ్ధి'కై సాగిపోతున్నట్టుగా వెళ్ళింది. ఇంతకు ముందు పద్యంలో ప్రకృతిలోని సౌంద ర్యాన్ని ముసలమ్మలో ప్రతిబింబింప చేసి, యిక్కడ ఆమెను ప్రకృతిలో లీనం చేసినపుడు ఆమె సౌందర్యాన్ని కూడా లీనం చేయడం కథకు పటు త్వాన్నిచ్చింది. ఈ వర్ణన సందర్భోచితంగా ఉంది.

కన్నెఱ్ఱ వాఱిన ఖరకరోదయ కాల మల్లనఁ గ్రుంగు జాబిల్లి యనఁగ
జ్వలదగ్ని శిఖలపై నెలనవ్వుతోఁ బోవు ధాత్రీమహాదేవి తనయయనఁగ
గెందామరల బారు సుందరమగు లీల నల్లనల్లనఁ జొచ్చునంచ యనఁగ
కాల మహా స్వర్ణ కారకుండగ్నిలోఁ గరఁగించు బంగారు కణికయనఁగ
ప్రళయ కాలానల ప్రభా భాసురోగ్ర
రంగ దుత్తుంగ భంగ సంఘాతములకుఁ
గలఁక నొందక, దరహాస మలర, మంద
మందగతిఁ బోయి, చొచ్చె నమ్మగువ నీట.''

(104వ పద్యం)

ప్రబంధ వర్ణనలకేమీ తీసిపోదు ఈ పద్యం. కాని ఈ వర్ణనలోని ఔచిత్యాన్ని కె వి. రమణారెడ్డి ''జలరాక్షసుని అంగిలి కూడా పుట్టింటి లోగిలి అన్నంత నిస్సంకోచంగా ముసలమ్మ మృత్యు ముఖ ద్వారాన ప్రవేశించింది. అది చావు కాదు- సిద్ధి. కాబట్టే ఈ సీస పద్య పాదాలన్నిటిలో సిద్ధి ద్వారా సార్థక్యాన్నీ బాధ ద్వారా ఆనందాన్నీ పొందిన వస్తు సంకేతాలను రామలింగారెడ్డి వాడు కొన్నారు.''[14] అని పేర్కొనడం సముచితంగా వుంది,

# స్త్రీ వర్ణన

ప్రబంధాలలో స్త్రీలు ఎండిన కట్టెల వలె ఉన్నారని, మనో వికాసము లేని గతి వారికి పట్టిందని కట్టమంచి భావించారు. పాశ్చాత్య దేశాల్లో స్త్రీకి ఉన్న స్థానాన్ని చర్చిస్తూ, వారు అంగవర్ణన నంతగా చేయరని ప్రశంసించారు. ఈ కావ్యరచన నాటికి, ప్రబంధాలలో 'స్త్రీ' శృంగార పర్యవసాయి గానే భావింప బడుతూంది.

"మొత్తము మీద నంగ వర్ణనమును మనసుతో గలసినట్లు చేయుశక్తి
యీ యాధ్యాత్మిక దేశములో గ్రుంగుడుపోయి యెన్నో శతాబ్దములైనవి" అని కట్టమంచి కవిత్వ తత్వ విచారంలో పేర్కొన్నారు.

పాశ్చాత్య ప్రభావం, సంస్కరణా దృక్పథం కలిగిన కట్టమంచి వాటిని ప్రతిబింబింప చేస్తూనే స్త్రీ పాత్ర చిత్రణ, వర్ణనల్లో ప్రత్యేకత చూపారు. అంగాంగ వర్ణనం కంటె' అంతరంగాన్ని దానిని మించిన అనురాగాన్ని స్త్రీ పాత్రల్లో సజీవంగా నింపారు.

"లేఁగమై నాకుచులీలమై మెడ మలంచిన గోవుఁబిండెడు వనరు హాక్షి
బొండు మల్లెల తోఁటఁ బువ్వులు గోయుచు వనలక్ష్మి యనమెప్పువనజగంధి
బీదసాదుల నెల్ల నాదరించుచుఁగూడు గడుపారఁబెట్టెడు కన్న తల్లి
వ్యాధి బాధల నెవరైన నడల ఱెప్ప వేయక కాచెడు వినుతచరిత
బిడ్డలెల్లరుఁ దమవారి విడిచి చేరఁ జంక నిడికొని ముద్దాడు సదయహృదయ
అమ్మ ! నీకిట్లు వ్రాయంగనౌనె బ్రహ్మకనుచు నూరి వారందఱు
నడలి యడలి

(౪౨వ పద్యం)

ఈ పద్యంలో వర్ణించింది "ముసలమ్మ'ను. ఆమె శీలస్వభావాదులే యిందులో వర్ణితాలు. 'వనరుహాక్షి,' 'వనజగంధి' అనే విశేషణాలు ప్రబంధ పరిధిలోవే కాని 'గోవు బిండెడు వనరుహాక్షి,' వనలక్ష్మి యనమెప్పు వనజగంధి' అనడం వలన విశేషణాలు ప్రబంధాలవైనా విషయం ప్రస్తుతానికి దూరం కాలేదు ఔచిత్యాన్ని వీడలేదు.

ఇక్కడ చెప్పవలసింది(కథాగమనం దృష్ట్యా) ముసలమ్మ సౌందర్యం కాదు. అందువల్లనే కన్న తల్లి, వినుత చరిత అని ఆమె సచ్ఛీలం, దయతో ఆదరిస్తుందని చెప్పడం వల్ల సూటిగా విషయంలోకి వెళ్ళడం కన్పిస్తుంది.

అందరినీ కన్న తల్లిలా ఆదరిస్తుంది. కాబట్టి, అందరికోసం ఈ త్యాగం ఆమె చేస్తుందని స్పష్టం చేయడం వర్ణనలతో మిళితమైన కథనం.

"సుదతీమణి కడు మెత్తని
హృదయాబ్జం గలది, పసిది, యేమి యెఱుఁగ, దా
పదలం బడ దెన్నండును,
హృదయేశుని విడిచి పోవ నెట్లోపునాకో."

(34వ పద్యం)

ప్రబంధాలలో వర్ణింపబడే స్త్రీ కాదు యిక్కడ. ''అడుగు వెట్టదు నవ్య హరి చందన లతాంత సరణిపైగాని'' అనేంతటి సుకుమారి కాదు ఈ కావ్యంలోని స్త్రీ. ఈమె హృదయాబ్జం కడు మెత్తనిది. దేహంలో సౌకుమార్యం, హృదయంలో దృఢత్వం కలిగినట్టిది. గ్రామ క్షేమానికై ప్రాణ త్యాగం చేసింది.

ఈ కావ్యంలో భావ నవ్యత స్పష్టంగా వున్నా, రచనా విధానం ప్రబంధాలకే దగ్గరగా వుంది. కావ్యంలో నవ్యత పరిపూర్ణంగా పోషింపబడా లంటే గతానుగతికమైన భావ, రచనా విధానాల్ని వదలి ఒక నూత్నమార్గాన్ని అనుసరించాల్సిందే ఈ కావ్యంలో భావ నవ్యత పోషింపబడినంతగా రచనలో నవ్యత కట్టమంచి సాధించలేక పోయారు. ''ఇది ప్రాచీన కావ్యమూ కాక, ఆధునిక కావ్యమూ కాక ఈ రెండింటికీ మధ్య ప్రభవించిన 'సంధి' కావ్యమన వచ్చు"[15]నని భావించిన డా॥సి. నారాయణరెడ్డిగారి అభిప్రాయం అంగీకార యోగ్యం.

# ముసలమ్మ మరణం అనుసరణాలు

'దువ్వూరి నలజారమ్మ' *1917*

కవి కోకిల ప్రథమ కావ్యం 'నలజారమ్మ'. కట్టమంచి వారి ప్రథమ కావ్యం 'ముసలమ్మ మరణం'. వయస్సులో 'ముసలమ్మ' పద్దెనిమిదేళ్ళు పెద్ద. గ్రామ క్షేమానికై తననుతాను బలి చేసుకోవడంలో ముసలమ్మ చూపిన

ఆత్మ త్యాగనౌన్నత్యం ఆమెను మనుషుల నుండి వేరు చేసింది. దేవతా స్వరూపాన్ని పొందింది. గ్రామ దేవత అయింది. దాంపత్య జీవన పాతివ్రత్యం. నిష్కపటానురాగం, ఆత్మత్యాగం ఆమెలో త్రివేణి సంగమంలా రూపు కట్టాయి. అందుకే ముసలమ్మ తర్వాత ఆమెవారసులుగా వచ్చిన నాయిక లెవ్వరూ ఆమె ఆత్మ సౌందర్యం ముందు నిలువలేక పోయారు.

'ముసలమ్మ మరణము' కావ్యంలో గైకొన్న కథ బుక్కరాయసము ద్రమనే గ్రామానికి సంబధించిందైతే, దువ్వూరి వారి నలజారమ్మలో కథ గూడూరు గ్రామానికి సంబంధించింది. నేటికీ గ్రామదేవతలుగా పరిగణింప బడుతున్న వీరు ఆయా గ్రామాల కవులను ఆకర్షించి తమ త్యాగాన్ని ఈ కావ్యాల్లో ప్రతిబింబింప చేసుకున్నారు. ఈ యిద్దరి కవుల కావ్యాల్లో రూపొందిన రచనా వైవిధ్యాన్ని సమీక్షించిన కె.వి రమణారెడ్డి 'ముసలమ్మ మరణము' కావ్యాన్ని 'పురా' లలో రాటు దేరిన అపరంజి బొమ్మగానూ, నలజారమ్మ కావ్యాన్ని అపుడే గని నుండి తీసిన ముతక బంగారంగానూ చెప్పారు. ఈ తారతమ్యం రెండు కావ్యాల రచనా స్వరూపంలోని వైవిధ్యం వల్ల స్పష్టమౌతుంది. ఒకే విధమైన యితివృత్తాన్ని ఈ యిద్దరు కవులు గ్రహించడం వల్లనే పోలిక సాధ్యమైంది. "రామిరెడ్డి రాసిన నలజారమ్మ ముసలమ్మను పోలివుండేందుకే పూనుకొంది గాని, స్వతంత్రించలేదు. ఈ పోలికలైనా పైపైనేగాని లోపలికి చొరబడలేదు." [16]అని పేర్కొంటూనే కె.వి.రమణారెడ్డి గారు "నలజారమ్మ ముసలమ్మకు నకలని"[17] వేరే చెప్పనక్కరలేదని అభిప్రాయపడ్డారు.

గ్రామ వైశిష్ట్యానికి కారణమైన స్త్రీ ఔన్నత్యాన్ని చిత్రించడంలో దువ్వూరికి మార్గదర్శకులైనారు రెడ్డి. ఆ కథలు వారు సృష్టించినవి కావు అక్కడ ప్రచారంలోవున్నవే. కథా స్వరూపంలో భేదం గోచరించినా రెంటికి ఆత్మగా ఉన్న 'త్యాగగుణం' వల్ల ఆకథల్లోని నాయికలు పఠితల మనసులను ఆకట్టుకున్నారు. యాధృచ్ఛికంగానే జరిగినా ఆ యితివృత్తాలకు దగ్గరి

సంబంధం ఉంది. ఇలాంటి కావ్య నాయికలను చిత్రించటంలో—కట్టమంచి దక్షతతోపాటు పరిణతి చెందిన ఆయన రచనా పటిష్టత 'ముసలమ్మ' లో ప్రవహించింది. ఈ విషయంలో దువ్వూరి కట్టమంచి కంటె కొన్ని మెట్లు కిందనే ఉండిపోయారు.

'ముసలమ్మమరణము' కథ ఈ అధ్యాయం మొదట్లో వివరించడం జరిగింది — నలజారమ్మ కావ్య కథ సంగ్రహంగా — గూడూరు గ్రామ పెద్ద పెరుమారెడ్డి పెంచలరెడ్డి కూతురు నలజారమ్మ. ఆ ఊరి న్యాయ పాలనను నిర్వహించే ఇజారాదారు ఆయనే. నలజారమ్మ భర్త వెంకటరెడ్డి. గర్భిణి యైన నలజారమ్మ కోరిక తీర్చడానికి వెంకటరెడ్డి జొన్న కంకులు తెచ్చాడు. రాత్రంతా చేనులోకి వచ్చే దున్నలను, పందులను తోలితోలి అల సిన శరీరంతో నిద్రమత్తులో పొరపాటున మాదిగవాని చేను కంచె దాటి అందులోంచి కంకులు తెచ్చాడు. మాదిగవాని ఫిర్యాదు నలజారమ్మ తండ్రి దగ్గరికి వచ్చింది. న్యాయాన్ని కాపాడ వలసిన ఇజారాదారుగా అల్లుని పై ఫిర్యాదు అందుకున్నాడు. అతనిలో సంఘర్షణ తల యెత్తింది. న్యాయ నిర్వహణలో సంకట పరిస్థితి ఏర్పడింది. అందుకే కూతురిని సలహా అడిగాడు దొంగతనం ఎవరు చేశారో చెప్పకుండా.

''బుద్ధి దెలిసి యెవఁడుపొనరుచుఁ జౌర్యంబు
నట్టివాఁడ శిక్షకర్హుఁ డిలను.'' [నలజారమ్మ పేజి 34]

అని తన న్యాయ సూత్రాన్ని చెప్పి కూతురిని నిర్ణయమడిగాడు తండ్రి అభి ప్రాయం గ్రహించిన నలజారమ్మ :

''గనకయ తొఁక్కినం బదము గాలక యుండునె? ధర్మమార్గమున్
మనమె తొలంగినం బరులు మాన్యతఁ జూతురె? నింద దప్పునే?'' [35]

అని తీర్పుచెబుతూ తురుష్కుల న్యాయ దండమైన 'కొరత' ను శిక్షగా సూచించింది. భర్తకు కొరత పడగా తాను అగ్ని గుండాన దూకింది. ఆత్మా ర్పణ చేసుకుంది.

ఊరికి కలిగిన ఉపద్రవాన్ని తప్పించడానికై ప్రేరేపతురాలై, గ్రామ ప్రజల సౌభాగ్యం తన కర్తవ్యంగా ఎన్నుకొని ఆత్మౌన్నత్యాన్ని చూపి, ఆత్మ త్యాగానికి సిద్ధపడ్డ స్త్రీగా 'ముసలమ్మ' చిత్రీకరింపబడగా; న్యాయ నిర్వహణలో తండ్రి స్వార్థం తమకు భిక్ష కారాదని, తన భర్తకు వచ్చిన కళంకం తన వంశానికి అంట కూడదని భావించి ఆత్మార్పణం చేసిన 'స్త్రీ'గా 'నలజారమ్మ' చిత్రింప బడింది.

రచనా విధానంలో కట్టమంచి వారి ప్రభావం కూడా 'నలజారమ్మ' మీద వుందని చెప్పవచ్చు 'ముసలమ్మ మరణము' కావ్యారంభంలో ఆ ఊరిని పరిచయం చేసేపుడు ఆ గ్రామ వాతావరణాన్ని కట్టమంచి:

''చెఱకుఁ దోఁటలఁ జొచ్చి కొఱికి పాడొనరించి
దొరవోలెఁ బోవు పందుల గణంబు,
నేంద్రకాయల కొఱ కేతెంచి గుంటిపై
మెక్కి కూసెడు గుంటనక్కగములు,
బడుగు బక్కలు గాక కడుపారఁ దిని పంది
గున్నలతో రాయు గొఱియ పిండుఁ,
బొలముల లేఁ బచ్చికల మెసి చియ్య చే
నిగనిగలాడు గో నికరములునుఁ,...''
—ముసలమ్మ మరణము(18)

ఇదే రకమైన వర్ణనను దువ్వూరి తన 'నలజారమ్మ' లో చేశారు.
''చెఱకు గానుగలను జిందిన రసబిందు లాన నీఁగలు ఝుమ్మురంచు మూగ;
జెఱకు ఁబిప్పిని మేసి చెలువారు సెలపెయ్య దాటులు బీళ్ళకుఁ దరలుచుండ,
నెదురు మోసులు తుంగ కుదురులు తెగమెక్కి యూరపందుల బారు గేరి తిరుగ;
గళమునందున వ్రేలుగంటలు మ్రోయంగ మేఁక మందలు పచ్చ మేతకేగఁ''
— నలజారమ్మ (పేజీ-9)

ఈ విధంగా 'నలజారమ్మ' కావ్యం 'ముసలమ్మ' కు తర్వాత వచ్చినదైనా; కథా గ్రహణంలోనూ, నిర్వహణలోనూ, రచనా విధానంలోనూ

'ముసలమ్మ' ప్రభావాన్నుండి తప్పుకోలేకపోయింది. నలజారమ్మ ఎంత ఆధునికమైననూ 'ముసలమ్మ' వలె పూర్ణత్వాన్ని పొంద లేక పోయిందనే చెప్పాలి.

# చిలుకూరి ముసలమ్మ (1938)

1938 వ సం॥ లో చిలుకూరి నారాయణరావు రచించిన చిన్న కృతి 'ముసలమ్మ' (పదము). కట్టమంచి గ్రహించిన యితివృత్తానే ఈయన గైకొన్నారు. అయితే నాటికి గురజాడ వారి 'పూర్ణమ్మ కథ' ప్రసిద్ధి పొందింది. అందుకు కారణం అది మాత్రా ఛందస్సులో పాడుకోడానికి, నాలుక పై నిలిచి ఉండడానికి అనుకూలంగా ఉండడం. దీనితో సామాన్య జనంలో దానికి అధిక ప్రచారం లభించింది. కరుణ రసాత్మకం విషాదాంత స్వరూపమైన ఈ కథను కూడా గురజాడ మార్గంలో వ్రాయాలనే సంకల్పంతో గ్రహించి ఉండవచ్చు. అందుకే పాత్ర చిత్రణలో కట్టమంచిని అనుసరించలేదు. చిలుకూరి; కాని వర్ణనల విషయంలో అక్కడక్కడా ఆయన ప్రభావం గోచరించకపోదు.

'ముసలమ్మ మరణము' లోని 'తటాక వర్ణన'ను పోలుతూ:

"లీలాలోల -తరంగమాలా
డోలావిహరణ- ఖేలాప్రముదిత
జాలపాద హే-లావిలసిత మా
ఋక్కరాయసం-ద్రంబదియ" పేజి — 3

అన్నది కట్టమంచి వర్ణించిన మహోగ్ర రూపాన్ని జ్ఞాపకం చేయకపోదు. 'ముసలమ్మ మరణము'లో ముసలమ్మ, అత్తమామల సంవాదం సంక్షిప్తంగానే ముగించినా, 'ముసలమ్మ' పదములో వేదాంతధోరణి అధికంగా ఉంది:

"ఒకరు చచ్చి ఊ -రంతా బ్రదికే
ఉపాయముంటే - ఒక్కరు చావగ
ఒపగ లేరను - ఊహ అదేటికి?
నేబలి యవుతా - నో యత్తా !" పేజి—15

"జీవం పోతే చెడు నీ దేహము,
దేహం పోతే జీవం చెడదే!
జీవము జీవుల - కోసము దేహము
విడితే శాశ్వత - మవుతుంది" పేజి—16

ఈ విధంగా 'ముసలమ్మ మరణము' కావ్యంలోని భావ నవ్యతను 'ముసలమ్మ' అందుకున్నా రచనా పద్ధతిలో అప్పటికి ఆధునికతను గలిగిన 'పూర్ణమ్మ' ను అనుసరించింది

# 4

# సమకాలీనుల పై వెలుగు వీచికలు

## కట్టమంచి-రాళ్ళపల్లి

కట్టమంచి, రాళ్ళపల్లి వారల పరిచయం 1910వ సం॥ మైసూరులో ప్రారంభమయింది. వీరిద్దరికి సంధాన కర్త శ్రీకందాళ రఘునాథాచార్యులు. వీరు కట్టమంచికి శిష్యులు. తరువాత వారికి వియ్యంకులు. ఆనాటికి 30 వసంతాల వయస్సు గలిగిన కట్టమంచి మహారాజ కళాశాలలో అధ్యాపకులు. రాళ్ళపల్లి 17 సం॥ల విద్యార్థి మాత్రమే. పరిచయం ఏ సుమూహూర్తంలో జరిగిందో కాని వారిద్దరి సాంగత్యం కృష్ణార్జునులను మైమరపిస్తుంది. ఒకరు సూత్రధారి, మరొకరు పాత్రధారి. కట్టమంచి అందించిన సహాయంతో రాళ్ళ పల్లి సాహిత్యానికి సౌందర్యాన్ని సమకూర్చారు. కట్టమంచికి వంశ పారం పర్యంగా లభించిన గుణం సాహిత్యాభి నివేశం. యౌవన ప్రాంగణంలోనే నవ్య సాహిత్యానికి 'ముసలమ్మ మరణము' కావ్యం సమర్పించారు. సాహి త్యాన్ని ప్రాణపదంగా భావించిన కట్టమంచి నాటికి ప్రవాసియై ఉండడం వల్ల-తెలుగువాడు, అందునా పండితుడైన రాళ్ళపల్లిపై అభిమానం ఏర్పడి ఉండవచ్చు. ఈ విషయాన్నే రాళ్ళపల్లి వినయంగా చెప్పారు- 'వారికి వయస్సులోను, పాండిత్యంలోను సరిపోలని వ్యక్తిని' అని. ఆ యిద్దరికీ లభించిన సాంగత్యం రోజురోజుకూ వృద్ధి పొందింది. సాహిత్య గోష్ఠి వారిద్దరికీ నిత్య కృత్యమైంది.

కట్టమంచి ఆ సమయంలోనే కళాశాలలో తెలుగు శాఖను ప్రారం భింపజేసి రాళ్ళపల్లిని పండితునిగా నియమించారు. వారిరువురూ చేసేసాహిత్య వ్యాసంగానికిది మరింత దోహదమైంది. చర్చలు ప్రారంభమయ్యేనాటికి ఒక్క సంస్కృత భాషా సాహిత్యంలో తప్ప మిగిలిన అన్ని విషయాల్లో రాళ్ళపల్లి కంటే కట్టమంచిదే పైచేయి. పందొమ్మిదవ ఏట కళాపూర్ణోదయం పై వెలయించిన విమర్శనాత్మక భావాలు వారి చర్చల్లో దొర్లి ఉంటాయి.

1914వ సం॥లో కట్టమంచి ప్రకటించిన 'కవిత్వతత్త్వవిచారము' గ్రంథ రూపం దాల్చడంలో రాళ్ళపల్లి సహాయానికి కృతజ్ఞతలు ఈ విధంగా వ్యక్తం చేశారు:

"నాకుందోడుగ మైసూరు మహారాజు కాలేజి యంద్రాంధ్ర పండితులగు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు నిలిచి నందున గార్యము నెఱవేఱె గాని లేకున్న నై యుండుట సందిగ్ధము. ఇంత త్వరలో నై యుండుట అసంభవము."[1]

కవిత్వతత్త్వ విచారము గ్రంథంలో కట్టమంచి నూత్నకావ్య విమర్శ పద్ధతిని ప్రవేశ పెట్టారు పాశ్చాత్య సాహిత్య రీతులను తెలుగులో ప్రపంచించారు. ఈ వినూత్నమైన అభిప్రాయాలు నాటికి ఆంగ్ల సాహిత్య పరిచయం లేని రాళ్ళపల్లి వారిలో బీజరూపంలో ఉన్న ఆలోచనలపై పడి, ఒక కొత్త రూపాన్ని పొందాయి. ఈ విధంగా కట్టమంచి వారు రాళ్ళపల్లి భావాలపై వేసిన ప్రభావంతో ఆంధ్ర సాహిత్యానికి జరిగిన మేలు ఏమిటన్నది గ్రహించాలి.

వారి యిద్దరి అనుబంధాన్ని రాళ్ళపల్లి మాటల్లో:

''ఇరుప్రక్కలా మూడవ వ్యక్తికి చొరవలేని మధుర సంబంధము''[2]

విద్య, ప్రతిభ, లోకజ్ఞానం, అనుభవం, అధికారం, ఆత్మ ప్రత్యయం అన్నీ తూకంలో కట్టమంచి వారి వేపే మొగ్గ ఉన్నా, వారిద్దరి స్నేహం సమ తూకంగానే సాగింది.

సృష్టిలో ఒకొక్కరిది ఒక్కో వ్యక్తిత్వం. ఎవరి భావాలు వాళ్ళవి. అక్కడక్కడా బాహ్యంగా భావాల్లో పోలికలు కనిపించినా మౌలికంగా ఎక్కడో ఒక్కచోట భేదిస్తూనే ఉంటాయి. కాని పరస్పర భావ వినిమయం వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేస్తుంది. కట్టమంచి రాళ్ళపల్లి గార్ల మధ్య జరిగిన సాహిత్య గోష్ఠుల్లో యిద్దరికీ పరస్పరం తెలియని విషయాలెన్నో తెలుసుకున్నారు. కట్టమంచి వారి సహవాసం వల్ల రాళ్ళపల్లికి ఆంగ్లభాషా, సాహిత్యాల పరిచయం కలిగింది. "నా అభిప్రాయములలో ఏదేని తీవ్రత, ఆర్జవము కలదేని వారి సహవాస ఫలము. ...వారి వినోదము కొరకే నేనే తెలుగు కవిత్వమునకు శ్రీకారము చుట్టితిన"[3]ని చెప్పుకొన్నారు రాళ్ళ

పల్లి. ఈ మాటల ద్వారా రాళ్ళపల్లి సాహిత్య వ్యాసంగంపై కట్టమంచి ప్రభావం గమనించవచ్చు.

తిక్కనపై వీరిద్దరిదీ ఏకాభిప్రాయం. ఆయన వారి అభిమాన కవి. భారతంలోని పాత్రపోషణను కూలంకషంగా చర్చించేవారు. "సభాపర్వము తిక్కన చేతికి లభించి వుంటే తెలుగుజాతి హృదయాల సత్తువను పరీక్షించి వుండేవాడు."[4] అని గుండె పొంగిన అభిమానంతో కట్టమంచి భావించారు. మిత హిత సత్య వాక్కులు పలుకపలెననే పరాయణం నన్నయదనీ, "కళలో మితినీ, హితాన్నీ, సత్యాన్నీ కొంతైనా మీరి రచన సాగించకపోతే అది అనుభవానికి చాలకపోతుంది"[5] అని పేర్కొంటూ అటువంటి మిత, హిత, సత్యాల మతిని ఎరిగి రచించిన వాడు తిక్కన అని రాళ్ళపల్లి తన అభిమానాన్ని ప్రకటించారు.

కట్టమంచి వారి సాహిత్య విమర్శ పాశ్చాత్య ప్రభావంతో పదును తేలింది. కట్టమంచి చేసిన కావ్య విమర్శలో అభిరుచి దోబూచులాడింది. అది అభిరుచి విమర్శగా అందరి మన్ననలను పొందింది. అయితే అంత వరకూ ఉన్న ప్రాచ్య కావ్య లక్షణాలు పాశ్చాత్య సాహిత్య రీతుల సుడిగాలిలో చెల్లా చెదురైనాయి. నవయుగ భావాభిమానం ఆయనను ఉక్కిరి బిక్కిరి చేసింది. ఇవి వీరి విమర్శల్లో ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. కట్టమంచి చేసిన ఈ విమర్శనా విధానమే రాళ్ళపల్లికి భూమికగా నిలిచింది. కట్టమంచి నుండి గ్రహించిన భావాల్ని జీర్ణంచేసికొని ప్రాచ్య, పాశ్చాత్య సంప్రదాయాలు రెంటిని రాళ్ళపల్లి తన దృక్పథంతో సమన్వయించారు. కట్టమంచి పరిచయంతో నేర్చుకున్న ఇంగ్లీషు రాళ్ళపల్లికి యిందుకుపకరించింది. అంత వరకు సాహిత్యంలో లేని 'సాహిత్య సౌందర్య మీమాంస'కు ఆయన ప్రాణంపోసారు ప్రాధాన్యత యిచ్చారు.

ఇద్దరి కావ్య కళా దృష్టి భేదాల్ని కె వి రమణారెడ్డి: "రామలింగారెడ్డి దృష్టికి కళా ప్రయోజనాలు సుఖ, చమత్కారాలు అయినా, ఆయన సుఖానికే ప్రాముఖ్యానిచ్చారు. అనంతకృష్ణశర్మ సుఖానికీ, ఆనందానికీ భేదం చెప్పి, ఆధ్యాత్మికమైన శాంతి కళాప్రయోజనమని చెప్పాడు. కళలకు అనుకరణము సాధనము. సాధ్యము చిత్తైకాగ్రత, దాని ఫలము శాంతి...... శాంతి యనగా సోమరి తనము కాదు; ఏకాగ్రత. అవిదిత వేద్యాంతరముగా

ఏదేని ఒక వస్తువు నందు చిత్తము నిల్పగలుగుట. ఇట్టి అవస్థ ఆనంద మయము. ఆనందమనగా సుఖము కాదు. సుఖము యింద్రియములకు సంబంధించినది. ఆనందము ఆధ్యాత్మికము. అనగా ఆత్మకెక్కువ సంబంధించినది. రసానందం బ్రహ్మానంద సహోదరమనే అభిప్రాయానికి యిది దగ్గరగా ఉంది. దీని నొక్కి చెప్పక, ఇంద్రియ సుఖాన్ని ఉపలక్షించిన రామలింగారెడ్డిని రాజసమూర్తిగానూ, నొక్కి చెప్పిన అనంతకృష్ణశర్మను సాత్వికమూర్తిగానూ వర్ణించడం సబబే''[6]

కట్టమంచి రాళ్ళపల్లి వారి స్నేహసౌహార్ద్రాలను తెలిపే సంఘటనలు రెండు తెలుగు సాహిత్యంతో ముడిపడి ఉన్నాయి. ఇందులో మొదటిది కట్టమంచి ప్రోత్సాహం వల్లనే రాళ్ళపల్లి 'వేమన' గ్రంథం ఆంధ్ర సాహిత్యంలో వెలిసింది. ఈ ప్రోత్సాహానికి కారణం 1917 వ సం॥లో వావిళ్ళ వారి 'వేమనపద్యాలు' గ్రంథానికి రాళ్ళపల్లి వ్రాసిన పీఠికలో వేమన శైలిని గూర్చి వ్రాసిన విషయాలు కట్టమంచిని ఆకట్టుకొని ఉండ వచ్చు. కట్టమంచి సూచన పైనే రాళ్ళపల్లి ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఏర్పాటు చేసిన ఉపన్యాసాలివ్వడానికి దరఖాస్తు చేసినట్టుగా బంగోరె 'వేమన- సి.ఆర్. రెడ్డి' గ్రంథంలో నిరూపించారు. ఉపన్యాసాలిచ్చే భాగ్యం రాళ్ళపల్లికే దక్కింది. దీని వెనుక కట్టమంచి హస్తం ఉందని కొందరి అభిప్రాయం.

రాళ్ళపల్లి 'వేమన' పై యిచ్చే ఉపన్యాసాలకు గాను కట్టమంచి తన వైన ఆలోచనల్ని, సూచనల్ని ఎవరెవరిని సంప్రదించాలన్న విషయం ఎప్పటికపుడూ తెలియ జేస్తూనే వచ్చారు. వీటన్నింటినీ గ్రహించి విస్తృతమైన పరిశోధనకు మెరుగులు దిద్ది 1928 వ సం॥లో కాకినాడలో ఉపన్యాసాలిచ్చారు. ఇంతవరకు రాళ్ళపల్లి 'వేమన' ప్రామాణికంగా నిలిచి పోవడానికి కారణం కట్టమంచి వారిచ్చిన సూచనలు, ప్రోత్సాహమే అనడంలో అతిశయోక్తి లేదు.

కట్టమంచి పై తన అభిప్రాయాన్ని ప్రకటిస్తూ రాళ్ళపల్లి వేమన ఉపన్యాసాల విషయమై "ఆయనే జాబు వ్రాసి నాతో అర్జీ వేయించింది, పని చేయించింది. నా యందాయన కంత విశ్వాసం. ఆయన యందు నాకు నిజమైన గౌరవం - గురుభావం-ఎపుడూ కృశింపనిది.''[7] అని తమ అనుబంధాన్ని

చిరంజీవిగా వ్యక్తం చేశారు. రాళ్ళపల్లి 'గాథాసప్తశతి సారము' గ్రంథాన్ని కట్టమంచివారికే అంకితమిచ్చారు.

రెండవది రంగనాథ రామాయణం: కట్టమంచి ఈ గ్రంధానికి వ్రాసిన పీఠికలో ఈ కృతికర్త గోనబుద్ధారెడ్డి అనీ, రంగనాథుడు కల్పిత వ్యక్తి అని తన పరిశోధనకు అందిన విషయాన్ని చెప్పారు. ఈ నిర్ణయాలు రాళ్ళపల్లి వారికి సరిపడలేదు. రంగనాథుడే రామాయణం వ్రాసి గోనబుద్ధారెడ్డి పేరుపెట్టాడని ఒక వ్యాసం వ్రాసారు. ఎపుడూ ఎదుటి వారి విమర్శను సహృదయం తో స్వీకరించే కట్టమంచికి ఈ విషయం ఎందుకో కోపం కల్గించిందట. ఇద్దరికీ మిత్రులైన అబ్బూరివారు మీ శిష్యుని ధైర్యసాహసాలకు మీరు గర్వపడాలి అని చెప్పారట. తరువాత రాళ్ళపల్లి వారిని కలిసినపుడు "మీ విమర్శకులు మమ్ములను బతకనిస్తారేమయ్యా!"[8] అని అన్నారట కట్టమంచి. వారిరువురి స్నేహసౌహార్ద్రాలను వెలికి చెప్పే సంఘటన ఇది. కట్టమంచి రాళ్ళపల్లి వారల ఘన వ్యక్తిత్వాలు ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారి మాటల్లో

> "ఇద్దరిలోనూ ఒకే మనస్తత్వం ఉంది. ఇద్దరూ తత్త్వమూ, మీమాంస గురించి మాట్లాడారు. They supplemented each other. ఇరువురికీ కూడా ఒకే విషయం వల్ల ఆనందం కలుగుతుంది. అది సౌందర్యం. కాని, ఈ యిద్దరి నేపథ్యాలలో ఉన్న భేదం వల్ల, అంతరంవల్ల దాని అభివ్యక్తి భిన్నంగా గోచరిస్తుంది. ప్రేరణ ఒకటే, అయినా పరిణామాలుభిన్నంగా ఉంటాయి. పర్యవసానం రచనలలో గాని, జీవితంలోగాని రామలింగారెడ్డి గారు వెళ్ళినంత దూరం శర్మగారు వెళ్ళడం పొసగ లేదు"[9]

ఈ అభిప్రాయానికి వివరణ, సమాధానం రాళ్ళపల్లి వారి మాటల్లో:

> "మరినాది సనాతన సంప్రదాయం ఆయనది ఆధునికంలో ఆధునికం"[10]

ఇటువంటి భిన్న వ్యక్తిత్వాలు వారి వారి జీవితాల్లో ప్రతిబింబించాయి. కట్టమంచి వార వ్యక్తిత్వం పాశ్చాత్య ప్రభావ ప్రేరణను స్వీకరిస్తే, రాళ్ళపల్లి వారి వ్యక్తిత్వం పాచ్య, పాశ్చాత్య ప్రభావ ప్రేరణల్ని సమన్వయించింది.

# కట్టమంచి- దువ్వూరి

"సంక్షుబ్ధ సాగర కల్లోలములలో గాలిపీచినట్లెల్ల కొట్టుకొని పోవు చున్న అభినవ కవితా నావకు కట్టమంచి రామలింగారెడ్డిగారు కర్ణ దారులై నిలిచిరి. వారు రచించిన'కవిత్వతత్త్వవిమర్శ'మను గ్రంథము ఈ నవీనోద్యమమునకు మార్గదర్శకమైనది."[1]

ఇది కట్టమంచి వారిని గురించిన 'దువ్వూరి' అభిప్రాయం. దువ్వూరి సాహితీ జీవిత ప్రారంభ కాలంలో ఆయనకు కట్టమంచి మార్గదర్శకుడైనారు. కట్టమంచి 'ముసలమ్మ మరణము' దువ్వూరి 'నలజారమ్మ' గారూపు దాల్చింది. దీనిని గురించి యింతకు ముందు అధ్యాయంలో చర్చించాను. ఆంధ్ర సాహిత్యంలో సాహిత్య సౌందర్యం తత్త్వ దర్శనం చేసిన విమర్శకునిగా దువ్వూరికి అత్యున్నత స్థానం ఉంది. దువ్వూరి విమర్శ ప్రారంభించేసరికి 'కవిత్వ తత్త్వ విచారము' వ్యాప్తిలోకి వచ్చింది. తెలుగులో ఆనాటికి విమర్శాప్రక్రియలో ప్రామాణికంగా వచ్చిన రచన యిది, కాబట్టి ఆనాటి రచయితల పై ఈ విమర్శనా గ్రంథం అంతో యింతో ప్రభావం వేసింది. కాని విమర్శకుల వ్యక్తిత్వాలను బట్టి, ఆ ప్రభావ స్వభావం వారి వారి విమర్శల్లో కనిపిస్తుంది.

దువ్వూరి విమర్శపై కూడా కట్టమంచి ప్రభావం స్పష్టంగా గోచరించి రాను రాను అతని దృక్పథం మారింది. "... ప్రాచ్య సాహిత్యము, తద్విమర్శ సంప్రదాయం తోడి పరిచయము,అవగాహనము దానితోపాటు పాశ్చాత్య సాహిత్య విమర్శ సిద్ధాంత స్వభావము యొక్క ఆకలింపు రామలింగారెడ్డి గారి ప్రభావ గాఢత్వమును రామిరెడ్డి గారి యందు సడలింప జేసినది."[2]

కట్టమంచిలో నవయుగ భావాభిమానం ఉప్పొంగింది. ఉప్పెనలా వచ్చిన నూత్నమైన ఆలోచనారీతుల్లో ఆంధ్ర సాహిత్య ప్రక్రియల రూపం చెల్లాచెదురు కాగా కొందరు సాహితీ వేత్తలకు ఊపిరాడనిపరిస్థితి ఏర్పడింది. అదేసమయంలో రాళ్ళపల్లి, దువ్వూరి యిద్దరు కూడా ప్రాచ్య పాశ్చాత్య భావాలలో సమన్వయం సాధించి సంప్రదాయాన్నీ నవ్యతనూ సంధానించ డంలో కృత కృత్యులయ్యారు.

కట్టమంచి సుఖాన్ని కళా ప్రయోజనంగా గుర్తిస్తే, రాళ్ళపల్లి ఆనంధాన్ని ఆధ్యాత్మికమని పేర్కొన్నారు. దువ్వూరి కట్టమంచి కంటె రాళ్ళపల్లి

వలెనే ఒక అడుగు ముందుకు వేసి "కావ్యము ఆనందము. కావుననె ఆనంద దాయకము"[3] అని పేర్కొన్నారు. కట్టమంచి వారి ప్రభావం విమర్శకునిగా కంటె కవిగానే దువ్వూరి పై అధికంగా వేసింది. అయితే కట్టమంచి చెప్పిన పాశ్చాత్య రీతులనే తమ ప్రాచ్య, పాశ్చాత్య సమ్యగ్దర్శనానికి ఉపయోగించు కున్నారు. వీరిద్దరి విమర్శ దృక్పథాలను పరిశీలిస్తే దువ్వూరి తన దృక్ప థాన్ని తదనంతర కాలంలో ఎలా మార్చుకొని సమన్వయం చేసారో తెలు స్తుంది.

''అలంకారములనావశ్యకములు.''[4] "విపరీతాలంకార రచన భావ శూన్యతకు ప్రేరకము''[5] ''శిల్పములకు వర్ణనము ప్రధానము"[6] అని కట్టమంచి భావించినారు. కాని దువ్వూరి దృక్పథం యిది ''భావ ప్రకటనావ్యశ్యకతయే అలంకారములకు ప్రభావము."[7]

అలంకారాల సహజత్వాన్ని కట్టమంచి ఈ విధంగా శంకించారు. ''......భావములు తీవ్రముగ జెలరేగునపుడు వాని యుద్భవోద్రేకములకు హేతువులగు వస్తువులందప్ప నితరముల యెడ దృష్టిపారుట యసంభవము. మనసు చెలరేగినపుడు ఆలోచనలకుంబూనుట యౌచిత్య భంగమునకు ముఖ్య కారణము"[8] కాని అలంకారాల ప్రాముఖ్యాన్ని సహజ రూప కల్పనా పరి ధిలో సమర్థించారు. ''పరిమిత పదజాలముతో అపరిమిత భావములను ప్రక టింప వలసిన యెడల ఏవో కొన్ని సంకేతములు, శబ్దశక్తులు అక్కఱను బట్టి సహజముగ ఉద్భవించును.''[9]

నీతికి, కవితకు ప్రత్యక్ష సంబంధం లేదన్నది కట్టమంచి దృక్పథం. కాని దువ్వూరి ఈ రెంటి సమస్థితిని:

> ''నీతి స్పర్శలేనిదే సౌందర్యము పరిపూర్ణముగా గాదని నాయుద్దేశము.
> నీతి సౌందర్యమునకు హేతువు గాదు పరిపూర్ణతకు అవశ్యకమైన
> యొక ఔచిత్యం" గా పేర్కొన్నారు.[10]

లక్షణంగా కావ్య నిర్మాణ విషయంలో కట్టమంచి పేర్కొన్న 'అంగాంగ సంయోగత' ను దువ్వూరి కూడా ఉత్తమ ప్రతిభా జాతమైన కావ్యలక్షణంగా పేర్కొన్నారు. రసమును, రామణీయకమునందు అంతర్లీనం జేసిన జగన్నాథ పండితుల మార్గమే దువ్వూరి వారిది.

## కట్టమంచి-సమాలోచనం

సాహితీ ప్రపంచంలో ఒక కొత్త ప్రక్రియ ఉద్భవించినపుడు దానిపై విభిన్న విమర్శలువచ్చే అవకాశముంది. అయితేవాటన్నింటిలో ఏది ఆ ప్రక్రియకు సవిమర్శగా వుందని పరిశీలించడంకష్టతరమే అవుతుంది. ప్రవర్తనలో ఆ ప్రక్రియలో కన్పించే గుణం, అదివరకే ఆ ప్రక్రియపై వచ్చిన ఖండనను మించి ఎదగడానికి అవకాశం వుంది. అయితే యింతటి ప్రగాఢమైన విమర్శకు తావిచ్చే ప్రక్రియా గుణం- అంతవరకూ సంప్రదాయంగా వస్తున్న వాటిని మింగ వేసి తన రూపాన్నే ప్రదర్శించేదిగా వుండాలి. ఇందుకుఉదాహరణంగా కట్టమంచి వారి కవిత్వ తత్త్వ విచార గ్రంథాన్ని 'ముసలమ్మమరణము' ఖండ కావ్యాన్ని యిక్కడ ఉదహరించుకోవచ్చు.

## ముసలమ్మ మరణం

'ముసలమ్మ మరణము' కావ్యసృష్టి అప్పటివరకూ వస్తున్న కావ్యాలన్నింటికంటె కొన్ని నవ్య లక్షణాలున్న కావ్యంగా చెప్పుకోవచ్చును. అయితే కొంత మంది విమర్శకులు ఈ కావ్యాన్ని ప్రబంధాలలో చేర్చితే మరికొంతమంది నవ్య కావ్యంగా పేర్కొన్నారు. ఇవి రెండూ బాహ్య స్వరూపాన్ని బట్టి చెప్పినట్లుగానే అర్థమవుతోంది. అయినా రచనా స్వరూపాన్ని పరిశీలించిన కవులు దీనిని 'సంధి' కావ్యంగా పేర్కొని సమన్వయాన్ని సాధించారు. వీటన్నింటిని క్రోడీకరిస్తే సమన్వయ మార్గమే సరియైనదని తెలుస్తుంది. నవ్యకవిత్వానికి తొలి అరుణ కిరణం - ముసలమ్మమరణం ఈ కావ్యంపై వివిధ విమర్శకుల దృక్పథాలు క్రింది విధంగా ఉన్నాయి.

—పింగళి లక్ష్మీకాంతం:

"ఇరువదియవ శతాబ్ది యుదయింప నున్న వేగు బోకలో నక్షత్రము వలె మన సారస్వతాకాశమున నవ్యకాంతులతో ఆవిర్భవించిన 'నూత్న ఆంధ్ర కావ్యము' ముసలమ్మమరణము,"[1]

— యండమూరి సత్యనారాయణరావు:

''ఈ కావ్యం......అప్పటివరకు వచ్చిన కవితా సంప్రదాయములను వర్ణన విధానములను, కవిసమయములను పూర్తిగా మార్చి ఒక విప్లవమునకు అంకురార్పణ జరిగింది"[2]

— జి యన్ రెడ్డి:

"ప్రబంధ కవితకు మరణము—ముసలమ్మమరణము"[3]

— కె వి. రమణారెడ్డి:

"కట్టమంచి రామలింగారెడ్డి తనకు నవ్య కవిత్వ సమస్తాన్ని రుణగ్రస్తం చేసుకున్నాడు.'ముసలమ్మమరణము' ప్రథమ నవ్య కావ్యమైంది."[4]

— కొత్తపల్లి వీరభద్రరావు:

"భావ కవిత్వమింకను బాగుగా ప్రచారమునకు రాకపూర్వమే ఆంగ్ల సాహిత్య ప్రభావమున భావకవిత్వమునకు మార్గదర్శకమైనది"[5]

—కురుగంటి సీతారామాచార్యులు:

ఈ కావ్యం అప్పట్లో ఎవరినీ ఆకర్షించలేదని, 'తృణకంకణ' ప్రచురణ తర్వాతనే ఈ కావ్యం పాఠకుల దృష్టి పథంలో పడిందని, ఇది అనుసరించిన నవ్యత అతిస్వల్పమని - తమ 'నవ్యాంధ్ర సాహిత్యవీధుల' లో పేర్కొన్నారు.[6]

పై అభిప్రాయాలలో కొందరు నవ్య కవిత్వ లక్షణాలను ఈకావ్యానికి ఆపాదించడానికి సందేహించగా, ఇంకొందరు ఈ కావ్యం భావకవిత్వానికి భూమికగా నిలచిందన్న అభిప్రాయం సమన్వయం సాధించే పద్ధతిలో సాగింది. ఈ కావ్యాన్ని 'సంధి' కావ్యంగా చూసిన విమర్శకులు:

— సి. నారాయణరెడ్డి:

కావ్యంలో నవ్యత కంటె ప్రాబంధిక వైఖరే అదికంగా ఉందని, వస్తువు, కథ విషాదాంతం విషయంలో నవీనతా రేఖలు కొన్ని ఈ కావ్యంలో ఉండడంతో దీన్ని 'సంధి' కావ్యం అన్నారు [7]

— శ్రీ వల్లంపాటి వెంకటసుబ్బయ్య:

''ముసలమ్మ మరణము' ప్రాచీన ఆధునిక కవితల మధ్య సేతువుగా శోభిల్లుతూ ఉంది. నవ్య కవితోద్యమానికీ 'ముసలమ్మ మరణము' కావ్యానికీ ఎలాంటి సంబంధంలేదని కొట్టివేయడం అన్యాయం. నవ్య కవిత్వ మహాప్రభాతానికి యీ కావ్యం బాలసూదయం కాకపోవచ్చు కానీ 'తొలి ఉషోరేఖ' అన్న అభిప్రాయం సమంజసమైనదే"[8]

ఈ విధంగా ముసలమ్మ మరణం కావ్యాన్ని నిశిత పరిశీలనకు గురిచేస్తే దానిని 'ఉషోరేఖ' గానే గుర్తించాల్సి వస్తుంది. ప్రబంధాలు ఆ కావ్యాన్ని

పట్టుకో లేక పోగా, నవ్యకావ్యాలు కలుపు కోలేక పోయాయి. వేటిలో కల్సినా కలవక పోయినా సాహిత్య చరిత్రలో ఈ కావ్య స్థానం మాత్రం ప్రత్యేకం'' ఈ కావ్యంలో మరణాంతాన్ని విమర్శకులు లోకకళ్యాణార్థమై జరిగింది కాబట్టి మంగళాంతమే అనిపేర్కొని సంతృప్తిచెందారు. తొలి మరణాంత కావ్యరచన చేసిన ఘనత రెడ్డిదే.

# కవిత్వతత్త్వ విచారము- విమర్శలు

ఆంధ్ర సాహిత్య విమర్శలో 'కవిత్వతత్త్వ విచారము' గ్రంథం పై జరిగినంత చర్చ మరే గ్రంథం గురించి జరిగి ఉండక పోవచ్చును. దీనికి కారణం-ఆ గ్రంథ ప్రాదుర్భావం జరిగిన కాలమటువంటిది. సాహిత్యంలో సాంప్రదాయ దృక్పథం స్థానంలో పాశ్చాత్య ప్రభావంతో నవీనత చోటు చేసుకొనే ప్రయత్నంలో తల యెత్తిన సంక్షోభం ఇది. పాశ్చాత్య ప్రభావమే కాకుండా, పాశ్చాత్య సాహిత్య లక్షణాలు కూడా అందులో చోటుచేసుకున్నాయి. ఈ పరిస్థితుల్లో ఈ గ్రంథంపై వచ్చిన పలు విమర్శలను కూర్చి చూస్తే సాహిత్య విమర్శలో ఆ గ్రంథం యొక్క స్థానం తెలుస్తుంది.

—పింగళి లక్ష్మీకాంతం:

"యథార్థమయిన ఆంధ్ర కావ్య విమర్శ ప్రారంభమునకు ప్రథమాచార్యులుగా పేర్కొనదగిన వారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు"[9]

—దువ్వూరి రామిరెడ్డి:

''కవిత్వ తత్త్వ విచారమను విమర్శగ్రంథము ఈ నవీనోద్యమమునకు మార్గదర్శక మైనది."[10]

— విశ్వనాథ సత్యనారాయణ:

''ఆ రోజులలో కట్టమంచి రామలింగారెడ్డి గారు తమ కవిత్వ తత్త్వ విచారము వ్రాసి విమర్శన పథాలలో గొప్పదృక్పథము కలిగించి నవ్య సాహిత్యానికి కొత్త బోదెలు త్రవ్వారు.''[11]

—సి. నారాయణరెడ్డి:

"విమర్శన రంగమందు మాత్రము కవిత్వ తత్త్వ విచారము నూత్నయుగమునకు నాంది"[12]

'కవిత్వ తత్త్వవిచార' ప్రాశస్త్యాన్ని అంగీకరించ లేకపోయిన విమర్శకులు కొందరు- దాని ప్రాశస్త్యానికి సాహిత్యేతరమైన కారణాల్ని పేర్కొన్నారు. రెడ్డి గారి ప్రతిష్ఠయే అందుకు కారణం అన్నారు. అందులో నోరి నరసింహశాస్త్రి, పాటిబండ మాధవశర్మ ముఖ్యులు ఒక్క అక్కిరాజు రమాకాంతం తప్ప "మిగిలిన వాళ్ళంతా రెడ్డిగారి పదవికి దాసులై పోయారు."[13] అని సీతారామయ్యగారు అభిప్రాయ పడ్డారు.

—ఎస్వీ. రామారావు:

"లక్షణ గ్రంథముల అంతర్యం ఆయనకు అవగతము కాలేదని చెప్ప వచ్చును."[14] రామలింగా రెడ్డి ప్రతి పాదించిన సిద్ధాంతములేవియు క్రొత్తవి కావు...... వారు వెల్లడించిన యభిప్రాయములు అంతకు ముందు పలువురు వెలిబుచ్చినవే"[15]

పాటిబండ మాధవశర్మ:

"ఇంతకును కళాపూర్ణోదయము యొక్క తత్త్వము రెడ్డి గారికి పూర్తిగా తెలిసిందా?"[16]

అని రెడ్డిగారు ప్రతి పాదించిన సిద్ధాంతాలను సోపపత్తికమైన ఖండ నకు గురి చేయకుండా గ్రంధానికీ, ఆయనకూ గల పేరు ప్రఖ్యాతులు దృష్టి లోకి రాగా చేసిన విమర్శల్లా ఉన్నాయి. ఈ గ్రంధం వచ్చేనాటికి కవిత్వ స్వరూపం మారక పోయినా, నవ్య కవిత్వ లక్షణాలను, విమర్శ స్వరూ పాన్ని ప్రతిబింబించే గ్రంథావశ్యకత కన్పించింది. ఫలితం ఈ గ్రంధం.

—ఆర్ ఎస్ సుదర్శనం:

"కావ్యాల్లో పాత్ర పోషణకూ యదార్థ జీవితానికి సంబంధాన్ని వ్యాఖ్యానిస్తూ చక్కని విమర్శ వెలయించినారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి గారు. ఆవిధంగా తెలుగులో మనకు ఒక క్రొత్త సంప్రదాయం ఏర్పడింది. ఆధునిక విమర్శకు శ్రీకారం చుట్టబడింది."[17]

—కె. వి. రమణారెడ్డి:

"నవ్యాంధ్ర సాహిత్య ప్రారంభ కాలంలో కట్టమంచి 'కవిత్వతత్త్వ విచారము' తరువాతి విమర్శకులందరు సునాయాసంగా నడవగలంతటి కంటక రహితమైన విశాల మార్గాన్ని వేసిన రచన"[18]

—చేకూరి రామారావు:

"కాలానికి అవసరమైంది కట్టమంచి విమర్శ కాలగమనం యిష్టంలేక అన్నీ తాటాకుల్లోనే ఉన్నాయనే తత్త్వం ఆయన వ్యతిరేకులది"[19]

వీటిల్లో అతిశయోక్తులేమి లేవు ఈ గ్రంధాన్ని ఆధునిక సాహిత్యానికి ప్రామాణిక గ్రంథంగా గ్రహించి, తరువాతి కాలంలో వచ్చిన సరికొత్తసాహితీ రీతులకు ప్రమాణాలను నిర్ణయించుకుంటే కొంతలో కొంత సాహిత్యంలో పురో గమనాన్ని సాధించవచ్చును.

## చివరగా

సాహిత్యరంగంలో విమర్శకునిగానే పేరు పొందిన కట్టమంచివారిని, కవిగా ఆయన అభివ్యక్తిలోని నవ్యతను, ప్రత్యేకతను సోదాహరణంగా నిరూపించే ప్రయత్నం చేసాను ముందు వ్రాసిన "ముసలమ్మ మరణము'' కావ్యంలో ఆ తరువాతికాలంలో వెలువడిన ''కవిత్వతత్త్వవిచారము" లో రెడ్డిగారు ప్రకటించిన విమర్శ భావాలకు, తాత్త్విక దృష్టికి బీజాలు ఉన్నాయి అనే విషయాన్ని నిరూపించడానికి చేసిన ప్రయత్నం ఇది ''ముసలమ్మమరణము'' కావ్యాన్ని పరిశీలించే పరిధిలోనే ఇతరవిషయాల్ని పరిశోధనకు గురిచేయడం జరిగింది అందుకని కట్టమంచివారి మిగిలిన కృతులను, పీఠికలను ప్రాస్తావికంగానే గాని సంగ్రహంగా స్పృశించడం జరగలేదు. వీటిని తీసుకొని భవిష్యత్తులో ఏవరైనా పరిశోధన చేసినట్లయితే కట్టమంచివారి సమగ్రసాహితివిమర్శ, తత్త్వాలు, వ్యక్తిత్వాలు వెలువడడానికివీలుంది. కట్టమంచివారి వాఙ్మయకృషి జలధిలాంటిది. దానినుండి సాహిత్యపరిశోధకుని ప్రతిభనుబట్టి ఆణిముత్యాలు లభ్యమవుతూనే ఉంటాయి. పరిశోధన, విమర్శలు నిరంతరం సాగే కృషితే గదా!

—★—

# 1

# కట్టమంచి దృష్టిలో ఆంధ్ర సాహితీవేత్తలు

కట్టమంచికి సాహిత్యమంటే ప్రాణం. ఇది వంశానుగతంగా వచ్చిన అభిమానం. ఆయన సాహిత్యాచార్యుడు కాకపోయినా తెలుగు సాహిత్యంపై అభిమానంతో అధ్యయనం చేసి తదనంతర కాలంలో సాహితీలోకం విస్మరించలేని పీఠికలను, వ్యాసాలను, విమర్శగ్రంథాన్ని రచించి సాహితీ మూర్తులలో ఒకరైనారు ప్రముఖ సాహితీవేత్తలందరితో ఆయన సంప్రదింపులు జరిపేవారు.

సాహిత్యానికి సంబంధించిన ఏ సందర్భం వచ్చినా తనకు అభిమాన పాత్రమైన కవులను పొగడడం లోనూ,తెగడడంలోను వెనుకాడలేదు ఎందరో నవ్య కవుల, రచయితల, కావ్యాలకు, గ్రంథాలకు పీఠికలు వ్రాసారు "నాటి నవ్యసాహిత్యానికి సారథ్యం నెరపిన ముఖ్యులలో ముఖ్యులు డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు. వారి ఆమోదము పొందడము కవిగా పట్టభద్రులు కావడము''అన్న పుట్టపర్తి నారాయణాచార్యులవారి మాటలు కట్టమంచి వారి పీఠికల కున్న ప్రాధాన్యాన్ని సూచిస్తున్నాయి పీఠికారచనలో కట్టమంచి ప్రత్యేకతను వివరిస్తూ డా॥ బి భాస్కరచౌదరి ఈ విధంగా అభిప్రాయపడ్డారు "Dr. Reddy usually, in the first place, introduces the writer to the reader Then he probes deep in to the subject while in some cases he would not mind indulging in heated arguments, in some he would not hesitate drawing his own conclusions. Whatever be the nature of being it ends in a pat"[1]

## తిక్కన

కవిత్రయం మీద సమాన ప్రపత్తి వున్నా తిక్కన్నగారి మీద విశిష్ట పక్షపాతం కలిగిన వారు కట్టమంచి భావనాశక్తి, నాటక కౌశలంతో అనుసం

ధించి ఉండడమే నాటక రచనా శక్తిగా పేర్కొన్నారు నాటక రచనాశక్తి ప్రాధాన్యాన్ని "......నాటక రచనా శక్తి యున్నాగాని కావ్యములు సైతము యథార్థములుగఁ గన్పింపవు"[2] అని పేర్కొంటూ ఆ కళాకౌశలం తిక్కనలో పరిపూర్ణంగా ఉందని భావించారు రెడ్డి.

పాత్రనిర్మాణంలో చేష్టలకు, మాటలకుగల సమ్మేళనాన్ని దృఢతరం చేయడమె తిక్కన సాధించిన ప్రత్యేకత. ఈ ప్రత్యేకతయే కట్టమంచిని తిక్కనకు అభిమాన పాత్రునిగా చేసింది 'ముసలమ్మమరణము' కావ్యరచన లోని సంవాదం సందర్భంలోనూ, పాత్రచిత్రణ విషయంలోనూ తిక్కనను కట్టమంచి అనుసరించారు.

## వేమన

జన్మతః కవి కావాలని, పరనం అభ్యాసం మాత్రమే కవిత్వసృష్టి పరిపూర్ణతను సిద్ధింపచేయవని కట్టమంచి అభిప్రాయం. ఈ భావనకు ప్రమాణ మైన వాడు వేమన అతనికి పుస్తకజ్ఞానం గుంచుమించు సున్న అనే అభిప్రా యాన్ని వెలిబుచ్చారు రెడ్డి. వేమనను సహజ కవిగా చిత్రిస్తూ అతని ప్రత్యేక తను-కట్టమంచి·

''మనము ప్రతిదినమందును జూచుచు నింతేకదాయని యాదరము నవధానము నుంచకపోవు విషయములనే యాతడు గ్రహించి భావనా శక్తిచేఁ గాంతి, రూపము, ప్రాణము నావహింపజేసి యెదుట నిలుపగా నపుడు గుర్తుదెలియక పూర్వము మనచే గ్రహింపబడిన వయ్యును, నివి యేవో యమానుష విగ్రహములని విస్మయము జెంది గౌరవింతుము."[3]

ప్రకృతి జ్ఞానాన్ని కలిగిన కవులలో వేమన పరిపూర్ణుడని కట్టమంచి భావించారు. ప్రకృతి ప్రీతి 'రొమాంటిసిజమ్' లో ఒక భాగమై వేమనను ప్రశంసాపాత్రునిగా చేయడం విశేషం.

## సూరన

ప్రబంధ కవులలో కట్టమంచికి ప్రీతిపాత్రుడైన కవి పింగళిసూరన. ప్రబంధ సాహిత్యంలో కొంతనవ్యతను చూపించిన వాడు సూరన. సూరన కృతమైన 'కళాపూర్ణోదయము', 'ప్రభావతిప్రద్యుమ్నము' గ్రంథాలు అభి

మానం కాగా, వాటిమీద ఆయన చేసిన విమర్శయే 'కవిత్వతత్త్వవిచారము' గా రూపొందడం విశేషం. సూరనలోని కల్పనా వైచిత్రిని, పాత్రచిత్రణా నైపుణ్యాన్ని, నాటకీయశైలిని కట్టమంచి విశేషంగా అభిమానించాడు. కల్పనలో తిక్కనను సైతం సూరన మించాడని మానవప్రకృతిని ప్రతిబింబింపజేయడం లోను సంభాషణానైపుణ్యాన్ని ప్రదర్శించడంలోను తిక్కనకు సమానుడనే కట్టమంచి అభిప్రాయం.

సూరన నవ్యమార్గములో నడచినా ప్రబంధ శైలిలోనే ఎందుకు వ్రాసి వుంటాడన్న ఆలోచనకు కట్టమంచి అభిప్రాయం:

"సూరనార్యుని కాలములో ప్రాచుర్యమునకు వచ్చిన కవితారీతి ప్రబంధ రచన. అట్లగుట దానును ప్రబంధ - ధోరణినే వ్రాయవలసినవాడయ్యె. ఐనను భావగంభీరుడు వివేకవంతుడును అగుటంబట్టి సంపూర్తిగా ప్రబంధరీతి కూపంబునంబడలేదు."[4]

ఈ విషయమే కట్టమంచి వారికి కూడా వర్తిస్తుంది ఆయనలో భావనవ్యత ఎంత ఉన్నప్పటికీ భాషానవ్యత లేకపోయింది. అదీ యుగప్రభావమే అయి వుండవచ్చు.

కట్టమంచి సూరనను పాశ్చాత్య సాహిత్యవేత్త 'షేక్స్పియర్' తో పోల్చారు. సూరన, షేక్స్పియర్ సమకాలీనులు. సూరన 'రంభానలకూబర ద్వయవిలాసానికి' షేక్స్పియర్ 'కామెడి ఆఫ్ఎర్రర్స్' అనే ప్రహసనానికి పోలికలను చెప్పి సాహిత్యలోకాన్ని విస్మయంలో ముంచేశారు.

ప్రాచీన కవులలో తిక్కన, వేమన, సూరనలమీద రెడ్డికి ప్రత్యేకమైన అభిమానం. ఎడనెడ ఆయన అధునికుల మీద ప్రకటించిన అభిప్రాయాలను కూడా గమనిద్దాం. కట్టమంచివారు ఆధునిక కవుల కిచ్చిన ప్రోత్సాహాన్ని

డా॥ బి. భాస్కరచౌదరి

''గుణగ్రహణ పారీణులైన కట్టమంచివారి సూచనలు కొందరుపండితులచేత సాహిత్యసేవను చేయించడానికి కూడా దోహదంచేశాయి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి తిరుప్పావు తెనిగింపు, గిడుగు రామమూర్తి ప్రయోగ చంద్రిక ప్రకటనం, రాళ్ళపల్లివారి వేమనవ్యాసాలు, ప్రసిద్ధకన్నడాంగ్ల

నాటక రచయిత కైలాసంగారి కొన్ని నాటకాల ఆవిర్భావం ఈ సందర్భంలో పేర్కొనదగిన ముఖ్య విశేషాలు."[5] అని పేర్కొన్నారు.

తెలుగు సాహిత్యంలోకి తనతో ఆధునికతను మోసుకొచ్చి ఆధునికుల పీపుతట్టిన ఆయన అభిప్రాయాలు పరిశీలిద్దాం.

## వేదం వేంకటరాయశాస్త్రి

కట్టమంచి క్రైస్తవ కళాశాలలో చదివిన కాలంలో వేదం వేంకటరాయ శాస్త్రి శిష్యుడు. కట్టమంచివారి కవిత్వతత్త్వవిచారబీజమైన కళాపూర్ణోదయ విమర్శను విని అత్యుక్తి తొలగించుకోమని సలహా యిచ్చిరి. సమర్థి రంగయ్య సెట్టిగారు, వేదం వారు యిద్దరూ మిత్రులు వీరిద్దరూ కట్టమంచి వారిపై విద్యార్థి దశలో ప్రభావం వేసినవారు. "శ్రీ సెట్టిగారును, శాస్త్రిలవారును విద్యార్థుల మంచి మార్గములకు ప్రేరేపించు సహజశక్తిగలవారు ఆచార్యుల కుండవలసిన యుత్తమ గుణములలో నిది యెకటి. ఈ కళయందు వీరిరువురును అసామాన్యులు."[6]

వేదం వారు రచించిన విమర్శలు-ఆముక్తమాల్యదకు 'ఉత్కృష్టవాఖ్య' 'సంజీవనీ నామకము'. ఆముక్తమాల్యద ఆవిష్కరణోత్సవ సభలో కట్టమంచి ప్రసంగించారు. ఆ ప్రసంగంలో వేదంవారిని, వారివిమర్శ స్వరూపాన్ని గురించి చెప్పిన అనంతరం కట్టమంచి "ఏమాత్రము బ్రాహ్మణేతర కవులకు మన భాషా చరిత్రలో తక్కువపాటు. ఉద్దేశపూర్వకముగనో లేక నిరుద్దేశ్యముగ సంభవించినదో అదివిచారణీయమ'ని పేర్కొన్నారు. ఇది పండితుల కోపానికి దారితీసింది. ఈ వ్యాఖ్యానానికి కారణం పండితులు 'అముక్త మాల్యద' అల్లసాని పెద్దన కర్తృత్వం అనడమే. శ్రీకృష్ణదేవరాయలు బ్రాహ్మణేతరుడు కావడమే; ఈ వాఖ్యానానికి దోహదం అని కట్టమంచి అభిప్రాయం. కాని వేదంవారు రాయల నే కర్తగా పేర్కొన్నారు. ఈ సందర్భంలో తను చేసిన వ్యాఖ్యానాన్ని కట్టమంచి ఈ విధంగా సమర్థించుకున్నారు. "నూతనాభిప్రాయములు అలవాటునకు వచ్చుటకు కాలము పట్టునుగదా."[7]

వేదంవారి సాహితీ వ్యక్తిత్వాన్ని కట్టమంచి:

"ఆంధ్రభాషకు నూతన జీవమును; నవీనకళను; నవ్యమును, దినదిన ప్రవర్ధమానమును నయిున పరిణామమును ప్రసాదించిన పండితులును,

కవులును, నాటకకర్తలును వచన రచనాధురీణులును, వ్యాఖ్యాతలును అయినవారిలో శ్రీవేదం వేంకటరాయశాస్త్రిగారు ప్రథములు- అద్వితీయులు.''[8]

## రాయప్రోలు సుబ్బారావు

ఆధునిక సాహిత్యంలో యుగకర్తగా పరిగణింపబడుతున్న కవి రాయప్రోలు సుబ్బారావు. 1913వ సం॥లో 'తృణకంకణం' మొదటిసారిగా ప్రచురింపబడింది. ఆ నాటికి కట్టమంచికి, రాయప్రోలు వారికి పరిచయం లేనట్టుగా కట్టమంచి, రాయప్రోలుకు వ్రాసిన లేఖను బట్టి తెలుస్తోంది. ఆనాటికి ఒకరికొకరు వ్యక్తిగతంగా తెలియకపోయినా రాయప్రోలు వారినూత్న కవితాభివ్యక్తిని లేఖ ద్వారా ప్రశంసించడం కట్టమంచివారి ప్రోత్సాహగుణానికి తార్కాణం

". He holds a high rank amongst modern Telugu poets, and I think he is almost entitled to be acclaimed as the founder of a new epoch in the development of the Andhra literature"[9] అనేవి కట్టమంచి వారి ప్రశంసావాక్యాలు, తరువాతి కాలంలో వాస్తవరూపాన్ని పొంది; రాయప్రోలు యుగకర్త అయ్యారు.

తరువాత కొంతకాలానికి వారిద్దరికీ పరిచయం కలిగినట్టుగా, 'తృణకంకణం' కావ్యంలోని రాయప్రోలు 'నివేదన' ద్వారా తెలుస్తోంది. ఈ కావ్యాన్ని వారు రాయప్రోలు చే చదివించుకొని విని ఆనందపడినట్టుగా పేర్కొన్నారు. ఆ సందర్భాన్ని రాయప్రోలు "అదివిన్నప్పుడు రామలింగారెడ్డిగారి రసిక హృదయలోకము ఎంతో కుశలాతికుశలంగా విశదమయింద" న్నారు.

1940 వ సం॥లో రాయప్రోలుకు మరోలేఖ వ్రాస్తూ కట్టమంచి రాయప్రోలు కావ్యాల ప్రత్యేకతను:

"they are a marvel of our literature so fresh, powerful and impressive. your contributions to telugu will live long and charming, a perennial source of joy and inspiration."[10]అని రాయడం ఆకవికి ఏవో కొన్ని

ప్రశంసా వాక్యాలు దొర్లించడంకాదు. ఎంతో చదివితేనేగాని, ఆ తరువాత కలిగిన అనుభూతిని ఈ విధంగా తెలిపారు. అపుడపుడే సాహిత్యంలో ఎదిగి పోతున్నకవికి ఆనందాన్ని యినుమడింప చేసేవాక్యాలివి. కట్ట మంచి సహృదయతకు అద్దం పట్టే సందర్భాలివి.

## గురజాడ అప్పారావు

ఆధునిక సాహిత్యంలో అభ్యుదయ కవిత్వాన్ని తనపరం చేసుకున్న యుగకవి గురజాడ. గురజాడవారి 'కన్యాశుల్కం' అంటే కట్టమంచివారికి ఎంతో ప్రాణం. ఈ సందర్భంలో కట్టమంచివారి యిష్టాన్ని తెలియచేసే రాళ్ళపల్లి వారి వాక్యాలివి. " 'కన్యాశుల్కం'లో కొన్ని భాగాలు ఆయన నెమ్మదిగా చదువలేడు. చదువుకోనూలేడు. ఇంకెవ్వరైనా చదివితే ఇల్లెగిరిపోయేటట్లు, తన దేహంలో సంధి,సంధులూ శిధిలమయ్యేటట్లు విరగబడి నవ్వింది నాకెన్నోమార్లు అనుభవం."11

'కన్యాశుల్కం'లోని పాత్రచిత్రణా నైపుణ్యాన్ని కట్టమంచి "the characters of Apparao are human to the full. they live and stir the life in you, if you have any." అని విడమర్చారు.

'కన్యాశుల్క' నాటక ప్రాశస్త్యాన్ని గూర్చిన కట్టమంచి వారి అభిప్రాయమిది. "kanyasulkam remains a master-piece in the dafficult realm of social satire It is a glow with life and humanitv its men and women move about with all the graces and kindness oddities, cruelties, chiroscuros, sanctities and hypocrisies of real life a life in which nature and custom, reason and tradition, sentiment and superstition are in miserable conflict.[13]

## కందుకూరి వీరేశలింగం పంతులు

సాహిత్యంలో అనేక ప్రక్రియలు చేపట్టి సమర్ధవంతంగా రచించిన గౌరవం శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారిది. ఆయనది ప్రధానంగా సంస్కరణ దృక్పథం. సంస్కరణోద్యమానికి సాహిత్యాన్ని భూమికగా తీసు

కొని ఆయన రచనలు చేశారు. వీరి రచనల్లో హేళనకావ్యం ఒకప్రక్రియ, హేళన కావ్య స్వభావాన్ని కట్టమంచి:

"పరిహాసము నందుఁ బారుష్యము లేని పరిహాసముత్తమము"[14]

అని చెబుతూ వీరేశలింగం పంతులుగారు ఈ ప్రక్రియ యందు దక్షులని పేర్కొన్నారు.

తన ప్రత్యేక వ్యక్తిత్వంతో ఒక యుగాన్ని తనవైపుకు తిప్పుకొన్న సాహితీవేత్త తత్పూర్వ, సమకాలీన కవులపైన చేసిన వ్యాఖ్యలు సాహితీ లోకంలో పరిశీలనకు గురవుతాయి. ఆ యా కవులలోని ప్రత్యేకతలకు రూపు దిద్దే బాధ్యత అతనిపై ఉంటుంది. ఈవిధంగానే కట్టమంచి తనదైన సాహితీ వ్యక్తిత్వంతో 'సాహితీమూర్తుల'ను స్పర్శించారు. ఈ విమర్శలు తరువాత కాలంలో ఎంతో ఉపయోగకరంగా రూపొందాయి.



# 2

# డాక్టర్ సి. ఆర్. రెడ్డి రచనలు

| | ముద్రణా సంఖ్యా. | సం॥. |
|---|---|---|
| 1. ముసలమ్మమరణము. | మొ. ముద్రణ: 1900. | సం॥. |
| | నాల్గవ ముద్రణ· 1983. | సం॥. |
| 2 భారత అర్థశాస్త్రము. | ము 1913. | సం॥. |
| 3 కవిత్వతత్త్వవిచారము. | మొ. ము. 1914. | సం॥ |
| 4. ఆంధ్ర సర్వకళాశాల విద్యాప్రవృత్తి. | మొ. ము. 1916 | సం॥. |
| 5 లఘుపీఠికా సముచ్చయము | మొ. ము 1928. | సం॥. |
| 6. వ్యాసమంజరి. | మొ ము. 1939 | సం॥. |
| 7. పంచమి. | మొ. ము. 1954 | సం॥. |
| 8. శ్రీకట్టమంచిరామలింగారెడ్డి రచనలు (కొన్ని వ్యాసాలు, ప్రసంగాలు) | | |
| 9. వేమన సం॥ బంగోరె. | మొ· ము. 1981. | సం॥ |

## ఆంగ్ల రచనలు

| | | |
|---|---|---|
| 10. Speeches on Univ. Reform. | మొ ము. 1915 | సం॥. |
| 11 Drama in the East and west | మొ. ము. 1919. | సం॥. |
| 12. Articles on **R. T.** C. and other addresses. | మొ ము. 1931. | సం॥. |
| 13. An exam. of the Present satyagraha | | |
| 14. war and the congress. | | |
| 15. Congress in office. | మొ· ము. 1940. | సం॥. |

16. Democracy in contemporary India
17. Speeches and Essays. Edt. by.K V.R.
18. Selected writings of C. R. Reddy. మొ ము. 1981 సం||.

## కట్టమంచిపై వచ్చిన రచనలు

| | గ్రంథం పేరు. | రచయిత. |
|---|---|---|
| 1 | కట్టమంచి (డా సి. ఆర్. రెడ్డి జీవిత చరిత్ర-పద్యకృతి) | జి జోసపు కవి. |
| 2 | డా సి. ఆర్. రెడ్డి (1963 సం|| ) | గొర్రెపాటి వెంకటసుబ్బయ్య. |
| 3. | సాహితీమూర్తి కట్టమంచి (1981 సం||) | సం||. డా. బి భాస్కరచౌదరి. |
| 4. | డా సి. ఆర్ రెడ్డి పీఠికలు (1983సం||) | సం|| డా. బి భాస్కరచౌదరి |
| 5 | మహామహోపాధ్యాయుడు (1982) | శో శింగర్ రాజారెడ్డి. |
| 6 | కవిత్వతత్త్వ విచార విమర్శనము (1940) | కాళూరి వ్యాసమూర్తి |
| 7 | మహామేధావి డా|| సి ఆర్ రెడ్డి | అమళ్ళదిన్నె గోపీనాథ్. |
| 8 | ఆంధ్రరచయితలు (1950) | మధునాపంతుల. |
| 9 | సారస్వతమూర్తులు (1969) | ఆం. ప్ర సా అకాడమి. |
| 10. | ఆంధ్ర మహాపురుషులు. | జె సత్యనారాయణమూర్తి |
| 11. | ఆలోచనాలహరి. | యువభారతి. |

## ఆంగ్ల గ్రంథాలు

| | | |
|---|---|---|
| 12 | Dr. C R Reddy | Anjaneyulu D. |
| 13 | The wit wisdom And Human | K vasudeva Rao. |
| 14. | Men in the lime light | K Subba Rao. |
| 15 | Street | K. Iswara dutt |
| 16 | Lumanaries of Andhra Pradesh. | DR. S Sridevi |
| 17. | Studies in Kalapurnodayam | G V. Krishna Rao |

# జ్ఞాపికలు

## ఒకటో అధ్యాయం,

1. కవికోకిల (దువ్వూరి రామిరెడ్డి జీవితం-సాహిత్యం) కె. వి. రమణా రెడ్డి పుట 17
2 కట్టమంచి సాహితీమూర్తి, జి. ఎన్. రెడ్డి, పీఠిక.
3 వ్యాసమంజరి, కట్టమంచి రామలింగారెడ్డి పుట 119
4. 'Ibidem' " 125
5 'Ibidem' " 135
6. Some great lives—vol, 1, కట్టమంచిరామలింగారెడ్డి పుట 94.
7. డా॥ సి. ఆర్. రెడ్డి, గొట్టిపాటి వెంకటసుబ్బయ్య " 33
8 తెలుగుసాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం- డా॥ కొత్తపల్లి వీరభద్రరావు
9. Ibidem
10. 'ముసలమ్మ మరణము' ఉపోద్ఘాతం, పింగళి లక్ష్మీకాంతం పుట 2
11. కట్టమంచి సాహితీమూర్తి, జి యన్ రెడ్డి, పీఠిక,
12 డా॥ సి. ఆర్ రెడ్డి ఆంగ్ల రచనలు, సంజీవదేవ్, తెలుగువిద్యార్థి (డా॥ కట్టమంచి ప్రత్యేక సంచిక) పుట 54
13. డా॥ సి. ఆర్. రెడ్డి, గొట్టిపాటి వెంకట సుబ్బయ్య పుట 68
14. ఆంధ్ర సాహిత్య విమర్శ, ఆంగ్లప్రభావం, డా.జి.వి.ఎస్. పుట 180
15. 'Ibidem' ,, 179
16. వేమన- సి. ఆర్. రెడ్డి (వేమన- కట్టమంచివారు) ఆవుల సాంబశివరావు పుట 9
17. డా॥ సి. ఆర్. రెడ్డి ఆంగ్ల రచనలు, సంజీవదేవ్ పుట 52
18. కట్టమంచి సాహితీమూర్తి, బి. భాస్కరచౌదరి పుట 15
19. డా॥ సి. ఆర్. రెడ్డి, గొట్టిపాటి వెంకట సుబ్బయ్య
20. C. R. Reddy Centenary Souveneir. Edt. By. B. Muthu swami. (Dec 80) Page 49
21, డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారితో ముఖాముఖి (తేది. 16-2-83)

## రెండో అధ్యాయం

1. డా॥ సి. ఆర్. రెడ్డి, గొట్టిపాటి వెంకట సుబ్బయ్య పుట 32
2. తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం.
3. 'Ibidem'
4. 'Ibidem'
5. ఆంధ్ర సాహిత్య విమర్శ ఆంగ్ల ప్రభావం పుట 8
6 తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం
7. కాద-బిని, పీఠిక, కట్టమంచి రామలింగారెడ్డి
   సి. ఆర్. రెడ్డి పీఠికలు పుట 1¯3
8. ముసలమ్మ మరణము, పీఠిక పింగళి లక్ష్మీకాంతం పుట 6
9. ఆంధ్ర, సాహిత్య విమర్శ- ఆంగ్ల ప్రభావం పుట 174
10. 'Ibidem' పుట 171
11. కవిత్వతత్త్వ విచారము, కట్టమంచి రామలింగారెడ్డి పుట 29
12. 'Ibidem' పుట 31
13. 'Ibidem' పుట 22
14. 'Ibidem' —
15. 'Ibidem' పుట 50
16. 'Ibidem' పుట 88
17. ఆంధ్ర విమర్శ- ఆంగ్ల ప్రభావం
18. తెలుగు సాహిత్య వికాసం సం॥ కె. కె.
    రంగనాథాచార్యులు పుట 143

## మూడో అధ్యాయం

1. ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయములు- ప్రయోగములు- సి. నారాయణరెడ్డి
2. ఉషఃకిరణాలు, యండమూరి సత్యనారాయణరావు పుట 199
3. కెరెగెహార, రాళ్ళపల్లి అనంత జయంత పుట 2
4. ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయములు-
   ప్రయోగములు- సి. నారాయణరెడ్డి పుట 143

5 కట్టమంచి సాహితీమూర్తి, సం॥ డా. బి. భాస్కరచౌదరి
6. కవిత్వ తత్త్వ విచారము, కట్టమంచిరామలింగారెడ్డి పుట 22
7. ముసలమ్మ మరణము పీఠిక, పింగళి లక్ష్మీకాంతం పుట 6
8. కవిత్వ తత్త్వవిచారము కట్టమంచి రామలింగారెడ్డి పుట 35
9. 'Ibıdem' పుట 36
10. ఆధునికాంధ్ర కవిత్వము- సంప్రదాయలు-ప్రయోగములు పుట 4 50
11. కవిత్వ తత్త్వవిచారము, కట్టమంచి రామలింగారెడ్డి పుట 39
12. 'Ibıdem'
13. 'Ibıbem'
14. 'కవికోకిల' (దువ్వూరి సాహిత్యం-జీవితం), కె. వి. రమణారెడ్డి పుట 73
15 ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు పుట 147
16. కవికోకిల కె. వి. రమణారెడ్డి పుట 69
17. 'Ibıdem' పుట 75

## నాలుగో అధ్యాయం

*కట్టమంచి-రాళ్ళపల్లి*

1. కవిత్వ తత్త్వ విచారము, కట్టమంచి, పీఠిక పుట 6
2. 'కట్టమంచి వారి వైలక్షణ్యం' రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ డా॥ సి. ఆర్. రెడ్డి పీఠికలు పుట 1
3. శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ సన్మాన సంచిక, 1961. పుట 15
4. 'కట్టమంచి వారి వైలక్షణ్యం' రాళ్ళపల్లి పుట 6
5. 'Ibıdem' పుట 6

6. కవికోకిల కె. వి. రమణారెడ్డి, పుట 359

7. కట్టమంచి వారి వైలక్షణ్యం, రాళ్ళపల్లి పుట 7

8. రాళ్ళపల్లి వారి జీవిత చరిత్ర సంగ్రహము
-ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, అనంతరాగం, పుట 129

9 కొత్తపల్లి వీరభద్రరావు గారితో ముఖాముఖి (తేది. 24-3-83)

*కట్టమంచి-దువ్వూరి*

1. 'కవికోకిల' (దువ్వూరి జివితం-సాహిత్యం)
కె. వి. రమణారెడ్డి పుట 356

2 'Ibidem'

3. 'Ibidem'

4. కవిత్వ తత్వ విచారము, కట్టమంచి రామలింగారెడ్డి పుట 26

5 'Ibidem' పుట 29

6. 'Ibidem' పుట 43

7. కవి కోకిల, కె. వి రమణారెడ్డి పుట 361

8. కవిత్వ తత్వ విచారము' కట్టమంచి రామలింగారెడ్డి

9. కవికోకిల, కె.వి. రమణారెడ్డి పుట 367

## ఐదో అధ్యాయం

1. ముసలమ్మ మరణము, పీఠిక, పింగళి లక్ష్మీకాంతం

2. ఉషఃకిరణాలు, యండమూరి సత్యనారాయణరావు

3. కట్టమంచి సాహితీమూర్తి, పీఠిక, జి. యస్ రెడ్డి

4 కవికోకిల, కె వి. రమణారెడ్డి పుట. 356

5. తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావము,
డా॥ కొత్తపల్లి వీరభద్రరావు

6. నవ్యాంధ్ర సాహిత్య వీధులు, కురుగంటిసీతారామాచార్యులు

7. ఆధునికాంధ్ర కవిత్వం- సంప్రదాయములు- ప్రయోగములు- డా॥ సి నారాయణరెడ్డి పుట 147

8 అనంతరాగం, సం॥ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ

9. ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ- సాంప్రదాయిక రీతి. డా॥ కోవెల సంపత్కుమార్ పుట 31

10. Ibidem పుట 31

11. Ibidem పుట 31

12. Ibidem పుట 31

13 తెలుగు సాహిత్య వికాసం, సం. కె కె. రంగనాథాచార్యులు పుట 142

14 Ibidem పుట 142

15 ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ-సాంప్రదాయికరీతి పుట 33

16 తెలుగు సాహిత్య వికాసం, కె. కె రంగనాథాచార్యులు పుట 142

17 ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ- సాంప్రదాయిక రీతి పుట 32

18. కవికోకిల కె. వి రమణారెడ్డి పుట 355

19. తెలుగు సాహిత్య వికాసం, చేకూరి రామారావు పుట 143

## అనుబంధం-1

1. డా॥ సి. ఆర్. రెడ్డి పీఠికలు సం॥ డా॥ బి. భాస్కర చౌదరి పుట 220

2. కవిత్వ తత్త్వవిచారము, కట్టమంచి రామలింగారెడ్డి

3. Ibidem

4 Ibidem

5. డా॥ సి ఆర్. రెడ్డి పీఠికలు పుటxvii
6. Ibidem పుట 207
7. Ibidem పుట 208
8, Ibidem పుట 208
9 తృణకంకణం, ప్రశంసా పత్రము, కట్టమంచి రామలింగారెడ్డి
10. డా॥ సి. ఆర్ రెడ్డి పీఠికలు, లేఖ, అనుబంధం పుట 304
11. కట్టమంచి వైలక్షణ్యం, రాళ్ళపల్లి, డా॥ సి. ఆర్. రెడ్డి పీఠికలు పుట 5
12. Kanyashulkam Introduction by
C. R. Reddy —సి. ఆర్. రెడ్డి పీఠికలు Page 260
13. Ibidem పుట 261
14. Ibidem పుట 150

# ఉపయుక్త గ్రంథ సూచి


జయంత, రాళ్ళపల్లి అనంత : 'కెరెగెహార'

నారాయణరావు, చిలుకూరి : 'ముసలమ్మ పదం', ఆత్రేయాశ్రమం, అనంతపురం, 1938

నారాయణరెడ్డి సి, డా॥ : ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు-ప్రయోగములు, సికింద్రాబాద్, ఆం.ప్ర. బుక్ డిస్ట్రిబ్యూటర్స్, ద్వి ము 1977 [ప్ర. ము. 1967]

బంగోరె, : వేమన- సి. ఆర్. రెడ్డి, విశాఖపట్నం ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, 1981

భాస్కర చౌదరి, బి. డా॥ 1 : సాహితీ మూర్తి కట్టమంచి, చిత్తూరు సమతా పబ్లికేషన్స్. ప్ర ము. 1981
[సంపాదకుడు]

— 2 : డా॥ సి. ఆర్. రెడ్డి పీఠికలు, చిత్తూరు చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం 1983.

యువభారతి ఆలోచనాలహరి, హైదరాబాద్, 1980,

రంగనాథాచార్యులు, కె కె. డా॥ : తెలుగు సాహిత్య వికాసం [1900-1947 సం॥రాల మధ్య] హైదరాబాద్, ఆంధ్ర సారస్వత పరిషత్తు, 1979.
[సంపాదకుడు]

రమణారెడ్డి కె. వి. : కవికోకిల [దువ్వూరి రామిరెడ్డి జీవితం-సాహిత్యం] నెల్లూరు, కవికోకిల గ్రంధమాల, 1965

రామచంద్రారెడ్డి రాచమల్లు : సారస్వత వివేచన, విజయవాడ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, 1976.

రామారావు, ఎస్వీ : తెలుగులో సాహిత్య విమర్శ- అవతరణ- వికాసములు, హైదరాబాద్, పసిడి ప్రచురణలు, 1974.

రామిరెడ్డి, దువ్వూరి. : నలజారమ్మ, నెల్లూరు, కవికోకిల గ్రంథమాల, 1961.

వీరభద్రరావు, కొత్తపల్లి డా॥ : తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము సికింద్రాబాద్, అజంతా ప్రింటర్స్, 1960.

వెంకట సుబ్బయ్య, గొట్టిపాటి. : డా॥ సి. ఆర్ రెడ్డి, విజయవాడ, దేశి కవితా మండలి, 1963

సంపత్కుమారాచార్య, కోవెల, డా॥ : ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ- సాంప్రదాయిక రీతి, వరంగల్, స్వంత ప్రచురణ, 1981.

సత్యనారాయణరావు, యండమూరి. : ఉషఃకిరణాలు, విజయవాడ, ఆదర్శ గ్రంథ మండలి

సాంబశివరావు, గోపరాజు : ఆంగ్ల సాహిత్య చరిత్ర, విజయవాడ, నవజీవన్ బుక్ లింక్స్.

సీతారామయ్య, కురుగంటి. : నవ్యాంధ్ర సాహిత్య వీధులు [4 భాగములు] హైదరాబాద్, హైదరాబాద్ సాహిత్య పరిషత్తు '49

సుందరం, ఆర్వీయస్, అశ్వత్థ నారాయణ ఘట్టమరాజు, శ్రీరామచంద్రమూర్తి శివలెంక [సంపాదకులు] : అనంతరాగం, బెంగళూర్, రాళ్ళపల్లి అభినందన సమితి, 1977

సుబ్రహ్మణ్యం, జి. వి డా॥ : ఆంధ్ర సాహిత్య విమర్శ- ఆంగ్ల ప్రభావం హైదరాబాదు, యువభారతి, 1983.

సుబ్బారావు, రాయప్రోలు : 'తృణకంకణము,' హైదరాబాద్, వంశీ ప్రచురణలు, 1981.

## కట్టమంచి వారిపై వచ్చిన ప్రత్యేక సంచికలు:

1. తెలుగు విద్యార్థి డా. సి. ఆర్. రెడ్డి ప్రత్యేక సంచిక. జనవరి 1982. సం॥ కొల్లూరి కోటేశ్వరరావు.

2 C. R. Reddy Centenary Souveneir Edited by B. Muthuswamy

3. అభ్యుదయ (కట్టమంచి) విమర్శ విశేష సంచిక. విశాలాంధ్ర ప్రచురణాలయం.

—o—